ఓణీ ధరించిన అమ్మాయిగా ఒక పక్క కూర్చుని పారవశ్యంగా ఆ వాదనను ఆస్వాదిస్తూ తన అమాయకపు మనసును అర్పించుకోవడం పదేపదే గుర్తుకు తెచ్చుకుని నేటికీ ఆనందిస్తోందామె ఏకాంతంలో!

ఆ సమయంలో అతణ్ణే చూస్తూ నిలబడ్డ అళగమ్మాళ్ చెవిలో, "ఇతడు నీ భర్త.. మీ నాన్నకు చెల్లెలి కొడుకు, చిన్నతనంలోనే తల్లిదండ్రులు దూరమైపోయారు. చిన్నాన్న ఇంట్లో పెరిగాడు..." అని అమ్మ చెప్పింది.

భుజానికి ఆనించుకున్న వయోలిన్‌పై గడ్డాన్ని అదిమిపెట్టి, పెద్దపెద్ద కనుబొమ్మలను పైకిలేపి, విశాలమైన కళ్లతో ఎప్పటికీ కొత్తగా అనిపించే ఓ రాగంలా, అతడి మోము మదిలో ప్రత్యక్షం కాగానే.. తననూ పసిబిడ్డనూ వదిలేసిన ఆ భర్తను నిందించడానికో, దూషించడానికో ఆమెకు కలలో కూడా సాధ్యం కావటం లేదు.

'ఆయన ఒక స్వేచ్ఛా విహంగం. సంగీతం మాత్రమే ఆయన జీవితానికి తోడు. ఆయనవల్ల ఎవరికైనా ఏ ఇబ్బందో, కష్టమో ఉందా? ఆయన జీవితానికీ, పద్ధతులకూ లోబడలేని స్వభావం కలిగిన నా నుండి ఆయన దూరం కావడం జరిగింది' అని కాసేపటి క్రితం తనతో మాట్లాడిన పార్వతమ్మాళ్‌తో చెప్పిన విషయాలను మళ్లీ గుర్తుచేసుకుంది. అలా చెప్పటం పార్వతమ్మాళ్‌ను సమాధానపరచటం కోసమే కాదు.. ఆ నిర్ణయం వల్లే తన భర్తను అసహ్యించుకోవటమో, కోపగించుకోవటమో చెయ్యకుండా ఉంది. ఆమె తల్లిదండ్రులు బతికున్న కాలంలోనే రామదురై ప్రవర్తన రాన్రానూ మితిమీరడాన్ని ఆమె గ్రహించి, బాధపడినా తనవాళ్లకు తెలియకుండా దాచిపెట్టింది. అలాగా అతడిని కాపాడుతూ కూడా వచ్చింది.

అతడులేని సమయంలో ఎవరైనా అడిగితే, 'ఆయనకు బయటూళ్లో కచ్చేరీ ఉంది' అనో, 'నాతో చెప్పే వెళ్లారు' అనో అబద్ధం చెప్పేది. అతడి రాకకోసం ఎదురుచూస్తూ మేడమెట్లపై నుంచొని, కూర్చొని పచార్లు చేస్తూ ఎదురుచూసిన రోజులే ఆమె జీవితంలో ఎక్కువ.

రేడియోలోనూ, గ్రామ్‌ఫోను రికార్డుల్లోనూ వచ్చే అతడి వయోలిన్ నాదాన్ని ఆస్వాదించటానికి ఆమె చెవులు అలవాటు పడ్డాయి.

సంగీత జ్ఞానం లేకపోయినా, రసాస్వాదనలో మనసు అంకితం చేసినట్టు, మనిషికి సంబంధించిన జ్ఞానం లేకుండా ఓ వ్యక్తికి మనసు అర్పించినందుకు ఆమె ఎప్పుడూ తనను తాను నిందించుకోలేదు.

పార్వతమ్మాళ్ తడబడుతూ తమిళమూ, ఇంగ్లీషూ కలగలిపి మాట్లాడే మాటల్లోని అంతరార్థమూ, తన కుటుంబాన్ని గురించి తెలుసుకోవాలన్న ఆత్రుతనూ పసిగట్టిన అళగమ్మాళ్ - అన్నింటికీ ఇంగ్లీషులోనే బదులిచ్చింది.

అప్పుడప్పుడూ అళగమ్మాళ్‌ను చూసి నవ్వుతూ ఈ ఇంటిని దాటుకుని వెళ్లే పార్వతమ్మాళ్, ఈ సాయంకాలం కాంపౌండ్ గేటును తీసుకుని వచ్చింది. వస్తూనే, "మిమ్మల్ని కలవటానికే వస్తున్నా. మీరు విశ్రాంతిగా ఉన్నారా? లేకపోతే మరోరోజు రానా? " అని మేడమెట్లపై నుంచున్న అళగమ్మాళ్‌ను ఇంగ్లీషులో అడిగింది.

అళగమ్మాళ్‌కు ఆశ్చర్యంగా అనిపించింది.

"ప్లీజ్.. కమిన్.." అంటూ కొన్ని మెట్లు దిగొచ్చి పార్వతమ్మాళ్‌ను సాదరంగా లోనికి తీసుకెళ్లింది.

"నా పెద్ద కూతురు నళిని మీకు

తెలుసు.. మీ అబ్బాయి ప్రకాశమూ తనూ స్నేహితులు" అని కళ్లార్పుతూ హాల్లోని సోఫాలో కూర్చున్న పార్వతమ్మాళ్‌ను విచిత్రంగా చూసింది అళగమ్మాళ్.

పార్వతమ్మాళ్ దేని గురించి మాట్లాడ్డానికొచ్చిందో క్షణంలో అర్థమైపోయింది అళగమ్మాళ్‌కు.

"వాళ్లిద్దరూ ఒకచోట చదువుకుని ఉండొచ్చు" అని ఎంతో మామూలుగా చెప్పి నవ్వింది అళగమ్మాళ్.

అళగమ్మాళ్ అమాయకత్వాన్ని గ్రహించి పార్వతమ్మాళ్ నవ్వుతూ "దే ఆర్ ఇన్ లవ్.." అని స్వరాన్ని తగ్గించి చెప్పింది. చెప్పి, ఆపై అళగమ్మాళ్ ముఖంలో కనిపించే భావాలను చదవడానికన్నట్లు మౌనం వహించింది. ముఖంలో సంతృప్తి, 'నాకిది సమ్మతమే' అన్నట్టుగా పెదాలపై చిరునవ్వూ మార్చకుండా, అళగమ్మాళ్ అంగీకారం కోసం ఎదురుచూస్తోందామె.

ఆ విషయాన్ని నమ్మలేనట్టు ముఖం పెడుతూ అళగమ్మాళ్- "మనం ఇలాంటి విషయాల్లో తొందరపడి ఓ నిర్ణయానికి రాకూడదు" అని స్పష్టంగా, నిదానంగా ఇంగ్లీషులో చెప్పింది.

'అళగమ్మాళ్ ఈ ప్రేమను అంగీకరించదేమో?' అన్న కలవరపాటు పార్వతమ్మాళ్ మదిలో తలెత్తింది. 'ఇతర భాషలు మాట్లాడేవాళ్లతోనూ, జాతివాళ్లతోనూ సంబంధం పెట్టుకోవడానికి అందరూ ఇష్టపడతారా?' అన్న సందేహంతో, 'అలాంటి పాతకాలపు మనిషా ఈవిడ? కావటానికి వీల్లేదు. అలాంటి సంప్రదాయపు మనిషే అయితే ప్రకాశం లాంటి కొడుకును పైకి తీసుకురావడం ఈమెవల్లయ్యేదేకాదు. ఆ నమ్మకంతోటే కదా ఇంత సంతోషంగా ఈమె ఇంటిని వెతుక్కుంటూ వచ్చాం' ఇలా ఆలోచిస్తూ కూర్చొని ఉంది పార్వతమ్మాళ్.

అళగమ్మాళ్ రూపమూ, మాటల్లో స్పష్టత, అదే సమయంలో ఎదుటివాళ్లకు పట్టుబడకుండా మౌనం వహించటం.. ఈ గుణాలన్నీ పార్వతమ్మాళ్‌ను నిదానించేలా చేశాయి. కాసేపటి క్రితం వచ్చినప్పుడున్న ఉల్లాస ధోరణి మారి, చెంపకు చెయ్యి ఆనించి తన కూతురి భవిష్యత్తు గురించిన ఆలోచనల్లో మునిగిపోయిందామె.

"ఉండండి, కాఫీ తీసుకొస్తాను" అని అళగమ్మాళ్ లేచి హాలును దాటి వంటగదిలోకి ఒంటరిగా వెళ్లి నిలబడి.. తన కొడుకు ప్రకాశాన్నీ, అతడు ఎవరో ఒక మలయాళ అమ్మాయిని ఎన్నుకునేంతగా ఎదిగిపోయిన వైనాన్ని గుర్తుచేసుకుని ఒకసారి సంతృప్తిగా నవ్వుకుని- "ఇటీజ్ నేచురల్" అని గొణుక్కుంది.

ఒకరోజు ఆమె ఎప్పటిలాగే మేడమెట్లపై నిలబడి కొడుకు రాకకోసం ఎదురుచూస్తుంటే- బస్సులో నుండి దిగిన ప్రకాశం, నళినీ కలిసి మాట్లాడుకుంటూ రావటాన్నీ, నళినీ ఇంట్లోపలికి వెళ్లి వెనక్కు తిరిగి చూసి అతడికి చెయ్యి ఊపటమూ చూసిన దృశ్యం గుర్తుకొచ్చి. ఇప్పుడు ఆ విషయం టీకా తాత్పర్యంతో సహా అర్థమైపోయింది.

తన కొడుకు పెళ్లివిషయంలో ఆమెకు

## కొత్తగాలి...

**అతడు**
**లవ్‌మీ! లవ్‌మీ!!**
**ఆమె**
**లీవ్ మీ! లీవ్ మీ!!**

– చక్కా చెన్న కేశవరావు,
కావలి

ఎన్నో ఆలోచనలున్నాయి. అతడై ఒక అమ్మాయిని, అందులోనూ ఒక మలయాళీ అమ్మాయిని ఎన్నుకుంటాడని ఊహించనైనా లేదు. పార్వతమ్మాళ్ ఇప్పుడొచ్చి చెప్పే విషయాలు నిజమే అయితే, అందుకు అళగమ్మాళ్‌కు ఎలాంటి ఆక్షేపణా లేదు. కానీ కొడుకుతో కలిసి మాట్లాడాకే తన నిర్ణయాన్ని ఈమెతో చెప్పాలనుకుంటూ రెండు కాఫీ కప్పులతో హాల్లోకి వచ్చింది. పార్వతమ్మాళ్ లేచివెళ్లి ఓ కప్పును అందుకుంది.

పార్వతమ్మాళ్ ఇన్నాళ్లుగా ఈ ఇంటినీ, ఇక్కడున్న వస్తువులనూ చూసిన మనిషి. ఇప్పుడు ఈ ఇంటికి తన కూతురొచ్చి సుఖంగా బతకాలని మనసులో ప్రార్థించింది.

ఇద్దరూ ఎదురెదురుగా కూర్చున్నారు. అళగమ్మాళ్ వెనుకవైపు గోడకు తగిలించిన ఫొటోలను చూసిన పార్వతి - "ఇదెవరూ... ప్రకాశం తండ్రా? .." అంటూ ఎంతో మామూలుగా అడుగుతూ, లేచివెళ్లి గోడకు సమీపంలో నిలబడి ఫొటోను సునిశితంగా చూసింది.

"అచ్చు ప్రకాశం ఇప్పుడున్నట్టే ఉన్నారు. జుబ్బా, అంగవస్త్రమూ లేకపోతే ప్రకాశం అనే అనుకునేదాన్ని.." అంటూ ఒక చిర్నవ్వు నవ్వింది. భర్త గురించి ఈమె నోటినుండే ఏవైనా విషయాలు తెలుసుకోవాలని ఆశపడింది పార్వతమ్మాళ్.

ఈ ఇంటి కథ మొత్తం ఆమెకు నళిని ద్వారా తెలుసు. అయినా "ఆయన ఎక్కడ ఉద్యోగం చేస్తున్నారు? " అని మామూలుగా ప్రశ్నించింది.

"ఆయన ప్రముఖ వయోలినిస్టు, రామదురై అని మీకు తెలిసుండాలే.."

"అవన్నీ తెలుసు. వేరే ఏదైనా ఉద్యోగం కూడా చేస్తూండొచ్చు కదా? నళినికి ప్రకాశంతో పరిచయం అయ్యాకే మీ భర్త మీతో ఉండటం లేదని తెలిసింది" అంది పార్వతమ్మాళ్.

తలొంచుకుని ఆలోచిస్తున్నదల్లా అళగమ్మాళ్ ముఖం పైకెత్తి చిర్నవ్వు నవ్వుతూ "అవును, మీరు విన్నది కరక్టే!" అని ఖాళీ కప్పుల్ని తీసుకుని లోపలికి వెళ్లింది.

వంట గదిలో కాఫీ కప్పుల్ని కడిగి పెట్టేసి చేతుల్ని తుడుచుకుంటూ వచ్చి పార్వతమ్మాళ్‌తో ఇంగ్లీషులో అంది, "ఆయన ఒక స్వేచ్ఛా విహంగం. సంగీతమే ఆయన జీవితానికి తోడు. ఆయన జీవితానికి, పద్ధతులకూ లోబడని నా స్వభావం వల్లే ఆయన నా నుండి దూరం అయ్యారు" అంది అళగమ్మాళ్.

తర్వాత పార్వతమ్మాళ్ తన కుటుంబాన్ని గురించి వివరంగా అళగమ్మాళ్‌తో చెప్పింది. "గత ఐదేళ్ళుగా ఆమె భర్త దుబాయిలో పని చేస్తున్నట్టూ, ఏడాదికి ఒకసారొచ్చి రెండు, మూడు మాసాలు గడిపి వెళ్లే విషయాన్ని గుర్తుచేసుకుంటూ ఏడాదంతా ఆ సమయం కోసం మేము ఎదురుచూస్తూ ఉంటాం" అని ఆమె అన్నప్పుడు... 'తాను అలా ఎదురుచూసేలా ఉంటే ఎంత బావుంటుంది? ' అని మనసులో అనుకుంది అళగమ్మాళ్.

పార్వతమ్మాళ్ అంటోంది "ఆయన ఇక్కడ ఒక హోటల్లో మేనేజరుగా ఉండేవారు. నేను టెలిఫోన్స్‌లో ఉద్యోగం చేస్తుండేదాన్ని. ఇద్దరి జీతం కలిపి చూసినా చాలా తక్కువే. ఇప్పుడు బాగానే సంపాదిస్తున్నారు. పిల్లల్ని బాగా పెంచటానికీ, డబ్బు సంపాదనకు విదేశాలకు వెళ్తానని మిస్టర్ మీనన్ అన్నప్పుడు నేనైతే ఏడ్చేశాను. కలోగంజో తాగైనా కలిసే ఉందామనేగదా ఏ ఆడదైనా అనుకునేది? తర్వాత ఆలోచించాను! విడిపోయి ఉన్నా ఎదురుచూస్తూనేగా ఉంటాం అనుకుని సరేనన్నాను.. ఇప్పుడు ఐదేళ్ళు కావ

# మనసున ఉన్నదీ...



★ నవంబరు 'చతుర' శ్రుతిహాసన్ ముఖచిత్రంతో ఆకర్షణీయంగా ఉంది. కాప్షన్ మీదే. చతురప్రపంచం, కొత్తగాలి.. అన్ని శీర్షికలూ ఆకట్టుకున్నాయి. ఎమ్వీ రామిరెడ్డిగారి నవల 'సగం కాలిన జీవితం'లో ఎక్కడా అశ్లీలత దొర్లకుండా ప్రతి పాత్రనూ మలచిన తీరు బాగుంది. ప్రతి సన్నివేశమూ అద్భుతమే. మొదటి నవలనే చక్కగా రాసిన రచయితకు అభినందనలు.

– **తలారి దుర్గా ప్రసాద్,** కుషాయిగూడ

★ 'సగంకాలిన జీవితం' నవలను ఏకధాటిగా చదివాను. కుక్కబుద్ధి గల పులి'రాజా'ను చివరిలో అపూర్వ బయటికి నెట్టడం వల్లనే ఈ కథ బాగుంది. ఆమె వీధిరౌడీని రాముడిగా మార్చాలని అతడికి మంచిజీవితం కల్పించినా 'కృష్ణలీలలు' వదలడు.

– **కూన మల్లేశ్వరరావు,** శ్రీకాకుళం

★ ఎమ్వీ రామిరెడ్డి నవల ఆద్యంతం ఆసక్తికరంగా ఉంది. వికాస్ పాత్రను మలిచిన తీరు, అపూర్వ ధైర్యం, త్యాగం నచ్చాయి. ఇది మంచి సినిమా కథలా అనిపించింది.

–**కె.వి. శ్రీనివాస్,** హైదరాబాద్

★ 'సగం కాలిన జీవితం'లో రాజారావు వేరే అమ్మాయి వలలో పడ్డ సంగతిని అతడితల్లి వెంటనే పసిగట్టడం నచ్చింది. చతురోక్తులు, జ్ఞాన పీఠాలు ద్వారా గొప్ప వ్యక్తుల విశేషాలను అందిస్తుండటం బాగా నచ్చింది.

– **వి. రమాదేవి,** ఆరుగొలను, కృష్ణా జిల్లా

★ 'హేహే.. అమెరికా' ద్వారా అనేక సంగతులు తెలుస్తున్నాయి. 'సగం కాలిన జీవితం' కథను నడిపిన విధానం చాలా నచ్చింది.

– **అప్పల నరసింహం,** హైదరాబాద్

★ సుమారు దశాబ్దం నుంచి చతుర చదువుతున్నాను. ఎమ్వీ రామిరెడ్డి నవల 'సగం కాలిన జీవితం' నాకు బాగా నచ్చింది. ఇందులో మొదట ప్రస్తుతం జరుగుతున్నదాన్ని, తర్వాత గతాన్ని చిత్రిస్తూ కథను నడిపారు.

– **వెలగా రాజేశ్వరరావు,** తాళ్లపాలెం, విశాఖ

★ 'సగం కాలిన జీవితం' నవలలో ఒక పక్క ప్రేమకథ, మరోపక్క గ్రామరాజకీయ కక్షలను కలిపి, జీవనపోరాటాన్ని చక్కగా చిత్రించారు. 'చతురంగం' పూరించేందుకు ఎంతో ఆలోచిస్తేగాని సాధ్యం కావట్లేదు.

– **బి. శాంతి,** నెల్లూరు

---

స్తోంది.. వచ్చే నెల వస్తున్నారు..” అంటూ పార్వతమ్మాళ్ తన భర్త గురించి గొప్పగా చెప్పింది.

అళగమ్మాళ్ తనలో పొంగుకొచ్చిన నిట్టూర్పును పార్వతమ్మాళ్‌కు తెలియనీయకుండా అణచివేసింది. పార్వతమ్మాళ్ చాలాసేపు మాట్లాడుతూ కూర్చుంది.

అళగమ్మాళ్ రాత్రి భోజనం కోసం కాయగూరలు తరుగుతున్నప్పుడూ, వంట పనిలో మునిగిపోయినప్పుడూ పార్వతమ్మాళ్ ఆమె సమీపానికి వచ్చి కాసేపు నిలబడి.. కాసేపు నేలమీద కూర్చునీ మాట్లాడింది. అళగమ్మాళ్‌కూ పార్వతి గుణమూ, మాటలూ బాగా నచ్చాయి.

తన కూతురు నళిని బ్యాంకులో ఉద్యోగం చేయటాన్నీ.. ప్రకాశం మెడికల్ షాపుకు దగ్గర్లోనే ఆమె పనిచేసే బ్యాంకు ఉండటాన్నీ, నళినీ ప్రకాశం ఇద్దరూ అప్పుడప్పుడు కలుసుకునేవారనీ, ఈ కాలపు పిల్లలు ఎంతో బాధ్యతగా ఆలోచించే నడుచుకుంటున్నారనీ పార్వతమ్మాళ్ అంది.

“నళినీ ద్వారా నాకు, నా ద్వారా మీకు తెలిపి అనుమతి అడగమని చెప్పింది మీ అబ్బాయే! చూశారా, ఈ కాలపు పిల్లలు తమ ఇష్టాన్ని మాత్రమే చూసుకోకుండా పెద్దల అభిప్రాయాలను కూడా గౌరవించాలని భావిస్తున్నారు. ఈ విషయంలో మనం మన పిల్లలను చూసి గర్వపడొచ్చు. మనం అనుమతించకపోతే మన పిల్లలేమీ చేయిదాటిపోరు. ఈ విషయం

మీతో ఎలా మాట్లాడాలో.. మీరు దీన్ని ఎలా స్వీకరిస్తారోనని రెండు రోజులుగా మథనపడుతున్నాను. న్యాయంగా ఆలోచిస్తే మీ కొడుకు తన ఇష్టాన్ని మీతో చెప్పి, మీరు వచ్చి మమ్మల్ని కలిసి, అమ్మాయిని అడగటమే పద్ధతిగా ఉంటుంది కదూ? కానీ మీ అబ్బాయి మీపై గౌరవ మర్యాదవల్ల వెనకాడుతున్నారట. 'మనం ఈ విషయంలో తొందరపడాల్సిన పని లేదు. నిదానంగా ఆలోచించి మన పిల్లలకు ఏది మంచో, ఏది సంతోషాన్నిస్తుందో అదే చేద్దాం. అలా కాదని ఆత్మగౌరవం, పరువూ ప్రతిష్ఠ అంటూ డాంబికాలకు వెళ్లాల్సిన అవసరం లేదనుకునే ఇవ్వాళ నేనుగా మీ వద్దకు వచ్చాను. అబ్బాయి రాగానే నేను వచ్చి వెళ్లానని చెప్పండి. ఈ విషయమై నేనూ మావారికి ఉత్తరం రాశాను. ఆయన కూడా మిమ్మల్ని ఒకసారి కలిసి మాట్లాడి ఒక చక్కటి నిర్ణయాన్ని తనకు తెలపమని ఉత్తరం రాశారు. వచ్చే నెల ఆయన వస్తారు. ఆ సమయంలో పిల్లలకు పెళ్ళి చేద్దామని కూడా రాశారు" అని మలయాళం అక్షరాలతో కూడిన ఒక ఉత్తరంలోని కొన్ని వాక్యాలను చదివి ఇంగ్లీషులో చెప్పింది పార్వతమ్మాళ్.

ఆమెతో మాట్లాడుతూనే వంటపనంతా పూర్తిచేసింది అళగమ్మాళ్. ఎంత వద్దని వారించినా వినకుండా వంటపనిలో సాయపడింది పార్వతమ్మాళ్. తన కొడుకు ఈ విషయాన్ని తనతో చెప్పకపోవడం ఆశ్చర్యాన్ని కలిగించలేదు అళగమ్మాళ్‌కు. అతడి తీరే అంత! ఆమె అతడికి తల్లిగా మాత్రమే గాక తండ్రిలాగాను పెంచి, పెద్ద చేయడంవల్ల తండ్రిమీద ఉండే గౌరవమూ, తలపైకెత్తి మాట్లాడని వినయమూ ప్రకాశానికి ఉంది. తన అనుమతి కోసం వెనకాడుతున్నాడేమోనని ఆలోచించింది అళగమ్మాళ్. అతడికి అమ్మ అంటే ఏమిటో తెలియదా? అతడి ఇష్టానికి వ్యతిరేకంగా మొండితనం చూపించే తల్లా ఈ అళగమ్మాళ్? ఎప్పటికీ తనకొడుక్కి తన పట్ల అపనమ్మకమూ, భయమూ ఉండటానికి వీల్లేదు. సిగ్గుచేతనే అతడు తనతో నేరుగా ఈ విషయాన్ని ప్రస్తావించి ఉండడని పలు పలు విధాలుగా ఆలోచిస్తూ పార్వతమ్మాళ్ చెప్పే విషయాలను వింటూ తలాడిస్తూ ఉంది అళగమ్మాళ్.

బయలుదేరే ముందు పార్వతమ్మాళ్ "దేవుడి దయవల్ల అంతా మంచిగా జరగాలి.. మీ సంబంధం దొరకటం మాకెంతో గౌరవం.. సంతోషం" అంటూ ఒక సాన్నిహిత్యాన్ని ఏర్పరచుకున్నానన్న నమ్మకంతో కరచాలనం చేసింది.

"త్వరలోనే మన భర్తలతో పాటు మనం కలుసుకోబోతున్నామని నమ్ముతున్నాను.." అని అళగమ్మాళ్ సమాధానం కోసం ఎదురుచూడకుండా మేడ దిగి వెళ్ళిపోయింది పార్వతమ్మాళ్.

'ఆయనను నేను చూడబోతున్నానా? ప్రకాశం పెళ్లి దానికొక సందర్భం కానున్నదా?' అన్న ఆలోచనతో- పదహారేళ్ల ప్రాయంలో రామదురై బావకోసం మైమరచిపోయిందే- ఆ విధంగా ఒక పులకింత కలగటాన్ని చిరునవ్వుతో గ్రహించింది అళగమ్మాళ్.

'అవన్నీ ముగిసిపోయిన.. మళ్లీ తిరిగి రాని ప్రాయాలు'

ప్రకాశం వివాహానికి ఆయనొచ్చినా, అదొక అవసరం కొద్దీ జరిగినప్పటికీ, తనకూ ఆయనకూ మధ్య ఉన్న దూరం తగ్గిపోదు అనుకుంది ఆమె! అయినా నిజానికి, జరగబోయే ఆ కలయిక ఎలా ఉండబోతున్నదోనని స్పష్టంగా ఆమెవల్ల ఊహించడానికి కూడా వీలుకాలేక పోయింది.

'రామదురై బావ ఇప్పుడు ఎవరో గుర్తు



పట్టలేని ఒక పరాయి వ్యక్తిలాగా ఉంటారా? ఆయన గతితప్పిన జీవితమూ, తాగుడు అలవాటు ఆయన ఆరోగ్యాన్ని బాగా కృంగదీసి ఉంటాయేమో? తాను అనవసరంగా ఏదేదో ఊహించుకుంటోందా? దేనికీ అస్కారమివ్వని ఒక మామూలు కలయికగానే అది జరిగి, పెళ్లి గుంపుతో పాటు చెదిరిపోతుందేమో?' ...

ఇలాగంతా తన కొడుకు పెళ్లిగురించీ, తన భర్తరాక గురించీ మార్చి మార్చి తన మదిలో చిత్రాలుగా చిత్రీకరిస్తూ మేడమెట్లపై నిల్చుంది అళగమ్మాళ్. ఇదీ ఆమెకు

ఒక చిరకాలపు అలవాటే!

ఎంతకాలంగా ఆమె ఇక్కడే.. ఇలాగే.. నుంచొని ఎదురుచూస్తోంది!

పసిపిల్లగా ఉన్నప్పుడు, తండ్రికి ఒక్కతే కూతురైన గారాలపట్టిగా తండ్రి రాక కోసం ఎదురుచూస్తూ నిల్చుంది.

తర్వాత రామదురై రాక కోసం ఎదురు చూసింది.. అందులో చివరికి తను మోస పోవటం..

ఆ తర్వాత ఒక్కొక్క ప్రాయంలోనూ పెరుగుతూ వస్తున్న ప్రకాశం రాకకోసం ఎదురుచూసింది.

అళగమ్మాళ్ జీవితమే ఎదురుచూపు లకు అంకితమై పోయింది.

## 2

**ప**ది గంటలకు ప్రకాశం వచ్చాడు. అతడు బస్సులో నుండి దిగుతున్నప్పుడే చూసిన అళగమ్మాళ్ సంతృప్తితో నిటా రుగా నిలబడింది. అతడు పార్వతమ్మాళ్ ఇంటికి సమీపిస్తుండగా కిటికీ గుండా ప్రస రించిన వెలుగులో నళిని నీడ కనిపిం చింది.

'ఓహో, ఇతడి రాక కోసం ఎదురుచూ సేది నేను మాత్రమే కాదన్నమాట' అని అళగమ్మాళ్ మనసు సంతృప్తి చెందింది.

అతడు వచ్చేలోపు వంట గదిలోకి వెళ్లి, అతడు భోజనం చెయ్యటానికి ఏర్పాట్లు చేసింది. ప్రకాశం మెట్లెక్కి పైకొచ్చే అడు గుల శబ్దం ఆగాక, ఆమె కూడా హాల్లోకి వచ్చింది.

"అమ్మా.. చాలా ఉక్కపోతగా లేదూ? .. స్నానంచేసి వస్తాను.." అంటూ గదిలోకెళ్లి బట్టలు విడిచి ఒంటికి ఒక టవలు చుట్టుకుని బాత్‌రూములోకి వెళ్లాడు ప్రకాశం. గబగబ స్నానం పూర్తి చేసి లుంగీ, బనియనూ ధరించి టవలుతో తలను తుడుచుకుంటూ డైనింగ్ టేబుల్ వద్దకు వచ్చిన ప్రకాశాన్నే కళ్లార్పకుండా చూస్తోంది అళగమ్మాళ్.

అతడు భోజనం చేస్తుండగా ఉన్నట్టుండి అతనితో "ఇవ్వాళ సాయంత్రం పార్వ తమ్మ వచ్చింది" అని చెప్పి పెదాలను కొరుకుతూ చిరునవ్వు చిందించింది.

తింటున్నవాడు కళ్లు పైకెత్తి చూశాడు. ఆమె నవ్వుతూ ఉండటంతో సిగ్గుతో తల దించుకున్నాడు.

"పార్వతమ్మ ఎందుకు వొచ్చుంటుందో నీకు తెలుసు" అంది.

అతడు సమాధానం చెప్పకుండా లోలో పల నవ్వుకున్నాడు. అయినా తల్లి ఏం చెప్పిందో, ఏం చెప్పనున్నదోనని మనసు తహతహలాడింది.

"ఈ విషయాన్ని నువ్వే నాతో చెప్పుండొచ్చుగా! నీకు నా దగ్గర భయమెందుకు? నీ ఇష్టాన్ని కాదంటానా? " అంటూ అతడి ముంగురులను సరిజేసి, గడ్డాన్ని పట్టుకుని ప్రేమగా అటు ఇటు తిప్పింది.

అతడు తన కంఠాన్ని సవరించుకుంటూ "నళిని పనిచేసే బ్యాంకు మన షాపుకు ఎదురుగానే ఉంది. నేను ఆ బ్యాంకులో ఖాతా తెరవడానికి వెళ్లినప్పుడు ఆమె నన్ను వాళ్ల మేనేజరుకు 'మై ఫ్రెండ్ అండ్ నైబర్' అంటూ పరిచయం చేసింది" అన్నాడు.

"ఒకప్పుడు స్కూల్‌మేట్స్ కూడా.." అని అతడికి అడ్డుపడి చెప్పింది అళగమ్మాళ్.

"ఆ తర్వాత.." అంటూ కంచంలో కీచు మని శబ్దం వచ్చేలా వేలిని రాశాడు ప్రకాశం.

"మీరిద్దరూ ఫ్రెండ్సే అయిపోయారు.. అంతే కదూ? వచ్చే నెలలో మిస్టర్ మీనన్ వస్తున్నారట. మీకిద్దరికీ పెళ్లి చేసే ద్దామంటున్నారు ఆవిడ.. నీ పెళ్లి గురించి నేనెన్నో కలలు కన్నాను.. నాకు శ్రమ

లేకుండా చేసేశావు.. నీతో మాట్లాడకుండా, వాళ్లు చెప్పిన విషయాలను పూర్తిగా నిర్ధారించుకోకుండా, మనమేమీ నోరు తెరవకూడదని ఆమె చెప్పినదంతా విన్నాను. చాలా మంచివాళ్లు. కులం, భాష ఇవన్నీ వేర్వేరు అన్న తేడాలేమీ నాకు కనిపించలేదు. వాళ్లు చాలా ఏళ్లుగా ఇక్కడే ఉంటున్నారు. పద్ధతైన కుటుంబం.. ఏంటీ.. సరేనని చెప్పేయనా?" అని అతడు భోజనం పూర్తిచేసే లోపు.. మెల్లమెల్లగా తన సమ్మతినీ, ఆనందాన్ని తెలియజేసిన అళగమ్మాళ్, ఇంకో ముఖ్యమైన విషయం గురించి కూడా ఆలోచించింది.

"అలా అయితే, నువ్వు మీ నాన్నను కలుసుకుని 'మీరు దగ్గరుండి ఈ పెళ్లిని జరపాలని' చెప్పి వెంటబెట్టుకుని రావాలి" అంది.

ప్రకాశం తల్లి ఆత్మగౌరవాన్ని, గ్రహించి ఆమె అలా చెప్పటంలో గల న్యాయాన్ని గుర్తించి, తనకు ఆ ఆలోచనే రానందుకు సిగ్గుపడ్డాడు.

అతడికి తండ్రి అంటే పసిప్రాయంలోనే ఒకలాంటి భయం ఉండేది. ఆయన పీకలదాకా తాగి కనుబొమ్మలు పైకి సాగదీసి ఒక పిచ్చివాడిలా తనను దగ్గరకు తీసుకుని, తడిమి తడిమి ముద్దులు పెట్టుకోవడానికి ప్రయత్నించినప్పుడల్లా హడలిపోయి అరుస్తూ ఆయన్నుంచి విడిపించుకుని పారిపోయిన అనుభవాలే గుర్తున్నాయి.

తనబిడ్డ కూడా చెడిపోకూడదని తపించేది అళగమ్మాళ్. భర్త ఇంటికి రాలేదే అని మునుపంతా ఎదురుచూసేది. అది మాయమై, అతడు ఇంటికి రాకుండా ఉంటేనే మంచిదని భర్తను తలచుకుని ఆ కాలంలోనే భయపడేది.

తన భర్తకు తాగుడు అలవాటులోనూ, స్త్రీల విషయంలోనూ ఉన్న బలహీనతలను తెలుసుకున్న తర్వాత ఆమె భర్తనుండి దూరం కావటానికి, అతణ్ణి దూరంగా ఉంచటానికీ నిర్ణయించడం- కొడుకు భవిష్యత్తును దృష్టిలో ఉంచుకునే. అందుకే ఆమె తన భర్తతో కఠినంగా ప్రవర్తించవలసి వచ్చింది.

ప్రకాశానికి ఐదేళ్లు వచ్చేంత వరకూ, తన తల్లిదండ్రులు బతికున్నంతవరకూ, రామదురై ప్రవర్తనను సహిస్తూ వచ్చిన అళగమ్మాళ్, ఒకరోజు పూటుగా తాగి ఊగుతూ వచ్చిన రామదురైను ఇంటి బయటే నిలబెట్టి కాంపౌండ్ గేట్‌ను కూడా తియ్యకుండా, "తాగిగానీ, తాగటానికోగానీ ఈ ఇంట్లోకి మీరు రాకూడదు. తిరిగి వెళ్లిపోండి. మీకేంటి.. పడుండడానికి ఇండ్లా

> ## కొత్తగాలి...
>
> **కత్తులతో జయిస్తాడొకడు**
> **ఎత్తులతో జయిస్తాడొకడు**
> **అణుశక్తులతో జయిస్తాడొకడు**
> **కేవలం అక్షరాలతో జయిస్తాడొకడు**
>
> – వి. సూర్యారావు,
> అనకాపల్లి

కరవు? అలాంటి ఇల్లు కాదిది. నేనూ అలాంటి మనిషిని కాను.. నేను తలుపు తియ్యను. మీరు మత్తు దిగాక ఉదయం రండి" అని చెప్పి తలుపుమూసేసి లోపలికి వచ్చేసిందంతే! భర్త ముఖం చూసిన చివరి క్షణం అదే!! ఇరవయ్యేళ్లు గడిచాయి..

తల్లీ కొడుకులు ఒకే సమయంలో రామదురై పరిస్థితి గురించి ఆలోచిస్తూ.. బాధతో మౌనంలోకి మునిగిపోయారు.

ఒక సుదీర్ఘమైన నిట్టూర్పును విడుస్తూ కాసేపటి క్రితం పార్వతమ్మాళ్‌తో చెప్పిన

విషయాన్నే ఇప్పుడు కొడుకుతో ఇంగ్లీషులో చెప్పింది, "ఆయన ఒక స్వేచ్ఛా విహంగం!.."

ప్రకాశం దానికి బదులివ్వకుండా తల వంచుకుని తన తండ్రిని గురించి ఆలోచించసాగాడు. ఆయన మంచివారా, చెడ్డవారా అని అంతకుముందు ఆలోచించలేదు. అళగమ్మాళ్ తన భర్త గురించి కొడుకుతో ఇంతవరకూ ఏదీ తక్కువగానో, నీచంగానో చెప్పలేదు. 'తండ్రి తాగుడుకు బానిసైపోయిన ఒక అద్భుతమైన సంగీత కళాకారుడు' అని తప్ప ఆయన గురించి ఎక్కువగా ఆలోచించవలసిన అవసరం అతనికి కలగలేదు. ఆయన ఈ ఊళ్లోనే ఉంటున్నా, సంగీత కచేరీ ప్రకటనల్లో 'వయోలిన్ రామదురై' అని ఆయనపేరు కనిపించినా, ఆయన్ను వెతికి పట్టుకుని యోగక్షేమాలు అడిగేంత పరిస్థితీ లేదు. ఎప్పుడైనా రామదురై కచేరీకి వెళ్లి గుంపులో ఒకడుగా నిలబడి- సంగీతమూ విని, తండ్రిని చూశానన్న తృప్తితో తిరిగొచ్చి 'ఇవ్వాళ కచేరీలో నాన్నను చూశాను' అని తల్లితో చెప్పేవాడు.

"ఎలా ఉన్నారు? " అని అడిగేది తల్లి.

"ఉన్నారు, ఎప్పటిలాగే.. నిండు కుండలా!" అని బాధను కలిపి పరిహాసంగా అనేవాడు.

కచేరీ జరుగుతుండగా పక్కనున్న ఫ్లాస్కులో నుండి వొంపుకుని తాగేదేమిటో ఎవరికీ తెలియదనుకునే ,తండ్రి అమాయకత్వాన్ని గురించి ఆలోచించినప్పుడు ఆయన అతడికి ఒక 'పరాయి వ్యక్తి' లాగానే కనిపించేవారు.

"నువ్వెళ్లి ఆయనను కలుసుకుని మాట్లాడొచ్చుగా? ఇప్పుడు నువ్వు పెద్దవాడివై పోయావుగా? ఆయన దగ్గరేం భయం? " అనేది తల్లి.

"ఎంత పెద్దవాడినైనా 'నాన్న' అంటే ఉండే భయం ఎలా పోతుంది? ఆయన స్థిమితంగా ఉంటేగా? 'ఎవర్రా నువ్వు? ' అని అందరి ముందూ అడిగి- 'కొడుకయితే ఏం? మనవడైతే ఏం? ' అని ఇంకేమైనా అనరనే గ్యారంటీ ఏంటీ? " అని తాను ఆయనను కలుసుకోనందుకు గల కారణాన్ని వివరించేవాడు. అప్పుడు 'అతడనేదీ న్యాయమేగా? ' అని అనిపించేది ఆ తల్లికి.

బంధువుల పెళ్లిళ్ళలో ఈ ఇరవై ఏళ్ల కాలంలో రెండు మూడు సార్లు మాత్రమే తండ్రిని చూశాడు ప్రకాశం.

ఆ కలయికలో ఆయన అతనితో ప్రియంగానే నడుచుకున్నాడు. అతడి చదువు, ఆరోగ్యం మొదలైన విషయాలన్నీ శ్రద్ధగా అడిగి తెలుసుకున్నాడు. కానీ ప్రకాశమే ఆయనతో మనస్ఫూర్తిగా మాట్లాడలేకపోయాడు. తండ్రికి మరొక భార్యో లేక భార్యలో ఉన్నట్లు అతడికి తెలుసు. అందువల్ల ఆయనపట్ల ఒక విధమైన అసూయ. ఆయన ఎడబాటు అతడికి ఎట్టి పరిస్థితిలోనూ బాధను కలిగించలేదు. ఆయనపట్ల అతడికి అమితమైన అసహ్యమో, చులకన భావమో ఏదీ లేదు. అళగమ్మాళ్ కే లేనప్పుడు అతడికెందుకుంటుంది?

"అమ్మా! ఆయన్ను నేనెక్కడని వెతకను? ఆయనిల్లు ఎక్కడుందో, ఏమో? .. ఒక్కో వీధిలోనూ సంగీత కచ్చేరీ ప్రకటన కనిపిస్తుందేమోనని వెతకాలేమో? !" అని నవ్వాడు ప్రకాశం. ఆమెక్కూడా అతడు చెప్పిన తీరు నవ్వుతెప్పించింది.

"ఏదో ఒక సంగీత కార్యక్రమాలు నిర్వహించే కార్యాలయానికి ఫోను చేసి అడిగితే ఆయన చిరునామా దొరుకుతుంది. అవన్నీ కష్టమైన పనులేం కావు. దగ్గరుండి ఆయన ఈ పెళ్లి జరిపిస్తే నీకు గౌరవం. ఆయన సొంత విషయాలలో గౌరవంలేని వ్యక్తిగా ఉన్నా ఒక తండ్రి కదా? ఆ గౌర

## ప్రాణాలకంటే విలువైనదా?

నిన్నటి నిజం

నీతిగా బతికే రాజకీయ నాయకులు నేడు అరుదనేది జగమెరిగిన సత్యం. అయితే ఆనాటి అమెరికా అధ్యక్షుడు ఉడ్రోవిల్సన్ నిజాయతీకి నిలువెత్తు నిదర్శనంగా నిలిచారు.

ప్రిన్స్‌టన్‌లోని ఓ యూనివర్సిటీలో ప్రొఫెసర్‌గా చేరి, తర్వాత దానికి అధ్యక్షుడయ్యాడు. సరిగ్గా చదవని విద్యార్థులను సహించడనే ఖ్యాతిని ఆయన పొందాడు.



ఓరోజు పరీక్షల్లో కాపీ కొడుతూ ఓ విద్యార్థి పట్టుబడ్డాడు. విల్సన్ అతన్ని వెంటనే డిబార్ చేసాడు. అతని తల్లి విల్సన్‌ను కలిసి, తన కొడుకును తిరిగి కాలేజీలోకి చేర్చుకొనమని బతిమాలింది. తనకు త్వరలో ఆపరేషన్ జరగబోతుందని, కొడుకు వల్ల కలిగిన దుఃఖంతో తాను మరణించవచ్చునేమోనని కూడా చెప్పింది. ఆమె కోరికను ఆయన తిరస్కరించినా వదలకుండా వెంటపడి ప్రాధేయపడింది.

విసిగిపోయిన విల్సన్, "నేను కఠినంగా మాట్లాడేలా మీరే చేస్తున్నారు. మన ఇరువురి ప్రాణాలనూ ఒకవైపు పెట్టి, మరోవైపు యూనివర్సిటీకి జరిగే మంచిని పెట్టి, ఏదో ఒకటి ఎంచుకొనమంటే రెండోదాన్నే కోరుకుంటాను. పాఠాలు సరిగ్గా చదవకపోవడం తప్పుగా భావిస్తాను" అని చెప్పాడు.

ఆమె తన కోరిక తీరకుండానే వెళ్ళిపోయింది. తన బాధ్యత విషయంలో అంత కఠినంగా వ్యవహరించబట్టే ఆయన ఆ తర్వాత అమెరికా అధ్యక్షుడయ్యాడు.

---

వాన్ని ఇవ్వని కొడుకుగా నువ్వు ఉండొచ్చా? నువ్వే ఈ విషయాలన్నీ బాగా ఆలోచించి ఉండాలి. తక్కిన ఆలోచనలన్నీ చేస్తావుగా? దీనికింత ఆలోచించాలా? రేపే వెళ్ళి మీ నాన్నను కలువు. ఆయన సంతోషిస్తారు. ఆయనకూ వయసు మీద పడుతోందిగా.. వాటి గురించంతా కూడా ఆలోచించాలిగా? బి ఎ గుడ్ సన్?" అని కొడుకు ఆలోచనలోనూ, స్పందనలోనూ కదలిక కలిగేలా చెప్పింది.

తండ్రి గురించి తెలుసుకున్నదంతా అతడు తన తల్లికి చెప్పలేదు. ఆయనిప్పుడు ఎక్కువగా కచేరీలకి వెళ్లటం లేదట. సకాలానికి వెళ్లకుండా ఎందరో సంగీత విద్వాంసుల అపనమ్మకానికి గురై 'రామదురైనా? వద్దయ్యా' అని వేరే వాద్యగాళ్లను పిలిపించుకుంటున్నారట. రామదురై చిరకాలపు జతగాళ్లే ఆయనను వదిలించుకున్నారట. 'అయితే మాత్రమేం? ఇలాంటి వాటికి బాధపడే వ్యక్తా ఆయన?'

ఎన్నో కార్యాలయాలకు వెళ్లి అడిగినా తండ్రి చిరునామా దొరకలేదు ప్రకాశానికి. తల్లి అనుకున్నంత సులభంగా ఆయన చిరునామా దొరకలేదు.

చివరకు, యాదృచ్ఛికంగా- ఒక రేడియో కచేరీ ప్రకటనలో 'వయొలిన్.. రామదురై' అని వినగానే ఆకాశవాణి కార్యాలయంలో ఆయన చిరునామా దొరుకుతుందేమోనన్న ఆలోచన కలిగింది. రెండురోజులు ప్రయత్నించి చివరికి ఎలాగో- కోడంబాకం, చూళైమేడులో, కేరాఫ్ పుష్ప (రంగస్థల

నటి)' అన్న చిరునామాలో ఆయన ఉన్నట్టు తెలుసుకోగలిగాడు.

అక్కడికే వెళ్లి తండ్రిని కలుసుకోవటానికి అతడికి నామోషిగా అనిపించింది. తన ఇబ్బంది తెలిస్తే తల్లి కోపగించుకుంటుందేమోనని భయపడ్డాడు.

తల్లికి తెలియకుండా తండ్రికో ఉత్తరం రాసి పడేశాడు.

"ప్రియమైన నాన్నకు నమస్కారం. నేనూ అమ్మా క్షేమంగా ఉన్నాం. నా వివాహ విషయంగా అమ్మ మిమ్మల్ని కలిసి మాట్లాడి మీరే స్వయంగా వచ్చి నాపెళ్లి జరిపించాలని మీకు చెప్పి రమ్మంది. మిమ్మల్ని ఏ సమయంలో వచ్చి కలవాలో ఓముక్క రాయండి. మిగతా విషయాలు నేరుగా కలుసుకున్నప్పుడే.. మీ పుత్రుడు ప్రకాశం" అంటూ ఉత్తరం రాసి- 'శ్రీ వి. రామదురై, వయొలిన్ విద్వాంసులు, కేరాఫ్ పుష్ప (రంగస్థల నటి)' అన్న చిరునామాను రాస్తున్నప్పుడు అతనికి ఒళ్లంతా సిగ్గు ఆవరించింది.

రెండు రోజుల్లోనే అతడికి రామదురై నుండి జవాబు వచ్చింది.

'ప్రియమైన ప్రకాశానికి ఆశీస్సులు. నీ ఉత్తరం మోడువారిన నాజీవితంలో అనుకోని ఆనందాన్ని కలిగించిందని రాయటానికి నాకు మాటలు చాలటం లేదు. నీవు ఎప్పుడైనా ఈ పేదవాడి గుడిసెకు రావచ్చు. సాయంకాల సమయాలలో ఇంట్లోనే ఉంటాను. మీ నాన్న, రామదురై'

ఆ ఉత్తరాన్ని తల్లికిచ్చాడు ప్రకాశం. ఆమె ఎంతో ఆత్రుతగా దాన్నందుకుని కళ్లు కెంపులవుతుండగా ఆవేశాన్ని అణచుకుంటూ పూర్తిగా చదివింది.

ఉత్తరం చివరిలోనైనా 'మీ అమ్మ బావుందా?' అని ఒక్క వాక్యమైనా ఉంటుందేమోనని ఎదురుచూసి మోసపోయింది. 'మెడ పట్టుకుని బయటకు గెంటడమొక్కటే తక్కువ. తాళి కట్టిన భర్తను అర్ధరాత్రి వీధిలోనే నిలబెట్టి తలుపులు మూసేసిన ధర్మపత్నికి గౌరవం ఏంటీ? పరామర్శ ఏంటీ?' అన్న ఒక గొంతు ఆమెలో ప్రతిధ్వనించింది. అది ఆమె గొంతే!

"అమ్మా! మీరేంటో ఆయనను స్వేచ్ఛా విహంగం అంటున్నారు. ఆయన దాన్ని మోడువారిన జీవితం అంటున్నారే?" తల్లిని ప్రశ్నించాడు ప్రకాశం.

"ఊ.. అదే కదు నాయనా తాడు తెగిన స్వేచ్ఛా విహంగాలకు చివరకు లభించే ఫలితం!" అని బాధను గొంతులోనే అణచుకుంటూ అంది అళగమ్మాళ్.

"నువ్వెప్పుడు వెళ్లి ఆయనను కలుసుకోబోతున్నావ్? ఆయనకు ఏదైనా సాయం కావాలంటే మనమేగా చెయ్యాలి. మనకేమిటీ, ఆయనతో వైరమా? పోట్లాటా?.. వయసూ, యవ్వనమూ కలకాలం ఉంటాయా? ఆయనెలా ఉన్నారో తెలుసుకోవటానికి కూడా మనమింత వరకూ ప్రయత్నించలేదు. నేను చనిపోయానేమోనని ఆయనో, ఇతరులో అనుకునే విధంగా నడుచుకోకూడదు" అని అళగమ్మాళ్ ఏదో నేరం చేశాన్న భావనతో కూడిన అలజడికి లోనయింది.

తన తల్లికి తండ్రిపట్ల ఇలాంటి ఒక

## కొత్తగాలి...

**స్వాతి చినుకైనా సరే**
**తామరాకు మీద ఉన్నంత కాలం**
**నీటి ముత్యమే!**
**ఆల్చిప్పలో ఒదిగితేనే**
**అసలైన ముత్యం!**

– మంత్రి లక్ష్మీనారాయణ, సిరిసిల్ల

సహృదయతా, పశ్చాత్తాపమూ ఉంటా యాని అనుకోలేదు ప్రకాశం. అతడికి ఆశ్చ ర్యంగా అనిపించింది. అయినా 'అమ్మ ఎంత మంచిది' అని అనుకున్నాడు. ఆమె సంతృప్తికోసం తను ఏమైనా చెయ్యటమ న్నది తన బాధ్యత అనుకున్నాడు ప్రకాశం.

వచ్చే ఆదివారం తండ్రిని కలవటానికి వెళ్లాలని నిర్ణయించుకున్నాడు. అతడు ఆ రోజు కోసం ఎంతో ఆత్రంగా ఎదురు చూడసాగాడు.

## 3

రామదుర్రై చిరునామాను కనిపెట్టటం ప్రకాశానికి కష్టమేమీ కాలేదు. ఆ ప్రాంతం లోని ప్రజలు ఎంతో కలివిడిగానూ ఒకరి కొకరు అంతకుముందే పరిచయం ఉన్నట్టు గానూ కనిపించారు. ఆ వీధిలోని ఇండ్లు చాలా మటుకు పూరిగుడిసెలుగానే ఉన్నాయి. అయితే అవి గుడిసెలు కావు. ఎత్తయిన గోడలు, గాలి వీచేందుకు అనువైన కిటికీలు, కరెంటు కనెక్షన్లతో కూడిన సౌకర్యవంతమైన ఇండ్లుగానే కనిపించాయి అక్కడ. ప్రజలు కలసిమెలసి జీవిస్తుండటంతో, స్వల్పాదాయం గల పేదవాళ్లవ్వటం వల్ల ఆ వీధి వీధంతా తినుబండారాలు అమ్మే చిన్నచిన్న అంగళ్లతో పిల్లలు, ఆడవాళ్లతో సందడి సందడిగా కనిపించింది.

ప్రకాశం ఆ ప్రాంతానికి నాలుగ్గంటలకు వెళ్లాడు. అంతకు ముందు అతడు అలాంటి చోటుకు వెళ్లిందిలేదు. ఆ రోజు ఆదివారం కావటంతో యువకులూ, పిల్లలూ గుంపులు గుంపులుగా చేరి అక్కడక్కడా వాళ్ల వాళ్ల ఇళ్ల ముందున్న తిన్నెలమీద కూర్చుని క్యారంబోర్డు, పేకాట ఆడుతూ కనిపించారు. కొందరు పందేలు చెబుతూ గట్టిగా అరుస్తున్నారు. గోలగోల చేస్తూ ఆడుకుంటున్న పిల్లల్ని గొంతెత్తి పిలుస్తూ తమతో తీసుకెళ్లే ఆడవాళ్లు అటు ఇటు తిరుగుతూ కనిపించారు.

రేడియో సంగీతం గట్టిగా వినిపిస్తున్న ఒక టీ కొట్టు పక్కన రామదుర్రై ఇల్లు ఉండటాన్ని కనిపెట్టి, బయట నిలబడి ఆ ఇంటిని కాస్త తేరిపార చూశాడు ప్రకాశం.

ముందు భాగాన చిన్న కాంపౌండు గోడ, దానికొక చెక్క తలుపూ, ఈ మధ్యే రంగుల సున్నం పూయబడిన కొత్తదనంతో ఎండలో తళతళలాడుతోంది ఆ ఇల్లు. తలుపుకున్న గుండ్రటి పిడిని కదిలించి 'నేను ప్రకాశాన్ని వచ్చాను' అని అరిచాడు.

ఈజీ చెయిర్లో కూర్చుని ఉన్న రామదురైకు, ఎదురుగా ఒక బెంచిమీద కూర్చుని మాట్లాడుతున్న ఆయన ముగ్గురు స్నేహితులలో ఒకరు "మీకోసం ఎవరో వచ్చినట్టున్నారు" అన్నారు.

రామదుర్రై వెనక్కు తిరిగి చూసి పారవశ్యంతో లేచాడు "ఎవరో ఏంటీ? భలే చెప్పారులెండి.. హి ఈజ్ మై సన్!" అంటూ ఎంతో గొప్పగా చెబుతూ వేగంగా వచ్చి ప్రకాశంచేతిని పట్టుకుని లోపలికి తీసుకెళ్లారు. తాను ఇందాకా కూర్చుని ఉన్న ఈజీ చెయిర్లో అతణ్ణి కూర్చోబెట్టి ఎదురుగా నిలబడి సంతృప్తిగా కొడుకును చూశారు.

"వీళ్లంతా నా స్నేహితులు- మా వృత్తికి సంబంధించిన వాళ్లు. ఈయన తబలా సుందరం. ఆయన క్లారినెట్ రాజు. ఈయన ఆల్ రౌండర్ శేఖర్" అని వాళ్లకు కొడుకును పరిచయం చేసేలా "నా కొడుకు ప్రకాశం.. అవునూ నువ్వేం చేస్తున్నావిప్పుడు? " అంటూ అతని వైపు తిరిగి ప్రశ్నించారు.

"తిరువల్లికేనిలో 'ప్రకాశం ఫార్మసీ' అని

ఈమధ్యే ఒక చిన్న బిజినెస్ ప్రారంభిం చాను.. ఆరు నెలలు అయ్యుంటుంది" అని తండ్రితోనూ, ఆయన స్నేహితుల తోనూ చెప్పాడు ప్రకాశం.

"వెరీగుడ్, వెరీగుడ్.. సొంతంగా వ్యాపారం చెయ్యటమే మంచిది. మీఅమ్మ క్షేమంగా ఉన్నారా? " అని అడుగుతున్న ప్పుడు ఆయన చూపులు ఎక్కడో దూరంగా నిలిపి, ఇరవై ఏళ్లక్రితం చూసిన అళగమ్మాళ్ రూపాన్ని వెతుకుతున్నట్టుగా అనిపించింది.

"అమ్మే.. కచ్చితంగా మీరొచ్చి ఈ పెళ్లిని జరిపించాలని చెప్పమన్నారు"

"ష్యూర్ ష్యూర్.. మనలో మనకు విరో ధమా ఏంటీ? అక్కడికొచ్చి ఆ సంతోషా న్నంతా అనుభవించొద్దూ? మా సంతో షమూ, జీవితమే మరో విధంగా అయిపో యింది.. పిల్లల సంతోషంలోనే ఇకపై తల్లిదండ్రులకు సంతృప్తీ.. ప్రశాంతత.. ఏమంటారు? " అని దీర్ఘంగా చెప్పి, దానిపై మిత్రుల అభిప్రాయం అడిగారు.

అందుకు వాళ్లు "ఔనౌను" అంటూ తలా డించారు.

తండ్రి స్నేహితుల ముఖాలలో ఇతణ్ణి 'తన కొడుకు' అంటూ పరిచయం చేసిన ప్పుడు ఏర్పడ్డ ఆశ్చర్యం ఇంకా తొలగిపో లేదు. వాళ్లు పదేపదే ఒకరినొకరు చూసు కుంటూ ఓ రకంగా అసలు విషయాన్ని ఊహించగలిగినా, ఇన్నాళ్లూ తమకు తెలి యకుండా ఈ విషయాన్ని తండ్రి దాచి పెట్టి, ఇప్పుడు దొరికిపోయినట్టు ఊహించి ఆయనతో పరిహాసంగా అన్నారు.

"భలే మనిషండీ మీరు! ఇంత పెద్ద కొడుకున్న విషయాన్నే మాతో చెప్పకుండా దాచిపెట్టారే!" అని అంగలార్చాడు తల నెరిసిన తబలా సుందరం.

ఆ ముగ్గురూ రామదురైకు ఎంతో సన్ని హితులైన స్నేహితులని, వాళ్లు ఆయనతో మాట్లాడే ధోరణిని బట్టి అర్థం చేసుకు న్నాడు ప్రకాశం.

తండ్రి ఆలోచనాపరుడుగానూ, తన తప్పిదాలకు బాధపడే మనిషిగా తల వంచుకుని కళ్లు మూసుకుని ఉన్నట్టు అని పించింది ప్రకాశానికి. ఉన్నట్టుండి ఆయన తల పైకెత్తి వాళ్లను చూసి, వికసిత వద నంతో దీర్ఘంగా నిట్టూరుస్తూ "లైఫ్ ఈజ్ లైక్ దట్!" అన్నారు. తర్వాత ఇంకా కొన సాగించారు "దాచి పెట్టాలనా? ఛ ఛ! అలాంటిదేం లేదు. ఒక విషయాన్ని చెప్పు కోవటంలో మనకు గొప్పగా ఉండొచ్చు. ఆ విషయంతో సంబంధం కలిగిన మరొ కరికి అదెలా ఉంటుందో! ఏమంటారు? " అని వాళ్లవైపు చూశారు రామదురై.

'మీరేమంటున్నారో నాకర్థం కావటం లేదు? ' అని అడగాలనిపించింది ప్రకాశా నికి. అందుకు అవసరం లేనట్టు, తన స్నేహితులతో ఆయన చెప్పిన విష యాలు.. అతడికి వివరణ ఇస్తున్నట్టుగా అనిపించింది.

"మనమంతా కళాకారులం. మన జీవిత విధానాలు, జీవితం గురించిన మన దృక్కోణం అవతలివాళ్లకంతా వినోదంగా ఉండొచ్చు. వీళ్ల తాతయ్య ఉన్నారే, మా మామగారు.. ఆయన గొప్ప మారాజు! నా సంగీతానికి మైమరచిపోయి తన కూతురినే నాకు బహుమతిగా ఇచ్చారు. ఆ బహుమతికి తగ్గ వ్యక్తిగా నేను లేను" అని తమ బంధుత్వాన్ని గురించి ఆ స్నేహితులతో మనసువిప్పి మాట్లడటం తనకోసమే అనిపించింది ప్రకాశానికి.

"ఊ.. బంధుత్వం ఎక్కడికి పోతుంది? ఇదిగో వచ్చేశాడుగా, వెతుక్కుంటూ..? ఈ ఇరవైఏళ్లలో మీకు తెలిసీ నాతో కలిసి బతి కిన ఇద్దరూ వెళ్లిపోయారు.. అప్పుడే నాకొక మూఢనమ్మకంలాంటి ఒక భావం ఏర్పడింది. వీళ్ల అమ్మను నేను వదిలి

రావటమూ ఒక మంచి కోసమేమోనని..." అని చెప్పి తనలో తాను నవ్వుకున్నారు.

"ఇంతకు ముందు కచేరీలకు వెళుతున్నప్పుడు నిన్ను అప్పుడప్పుడూ చూసే సందర్భాలుండేవి. తర్వాత ఆ పెళ్లివాళ్ల ఇంట్లో కలుసుకున్నాం. అది జరిగిపోయి దాదాపు ఐదేళ్లయి ఉండొచ్చు. నువ్వు నాతో మాట్లాడ్డానికి వెనకాడినా నేను నిన్ను బలవంతంగా దగ్గరకు లాక్కుని మాట్లాడానా లేదా? బంధుత్వమంటే కలిసి ఉండటమేనా? కలిసుంటే అయిష్టం పెరిగుండేది. మనం ఒకరికొకరు అసహ్యించుకోవడానికి భయపడతాం. భయపడాలి! అదెంత గొప్పగుణం. ప్రేమకు పాత్రులైన వాళ్లనేగా అసహ్యించుకోగలం.. అలా ప్రేమకు పాత్రులైన వాళ్లను అసహ్యించుకోవడానికి వెయ్యి కారణాలున్నా, అసహ్యించుకోకుండా ఉండాలంటే విడిపోవడమే, దూరమైపోవటమే ఉత్తమం" అంటూ ఎంతో మామూలుగా చెప్పారాయన. తర్వాత ప్రకాశం వైపుకు తిరిగి "ఈ గుణపాఠాన్ని నేను మీ అమ్మ నుండే నేర్చుకున్నాను" అని ఇంగ్లీషులో చెప్పారు.

"మీరు ఈ మధ్య సభా కచేరీలకు వెళ్లటం లేదెందుకు?" అని ప్రశ్నించాడు ప్రకాశం. అతడు ఆయనను దూరం నుండైనా చూడ్డానికీ, ఆయన ఎక్కడున్నారోనని తెలుసుకోవటానికీ తపించిన సంఘటనలను గుర్తుకు తెచ్చుకున్నాడు.

"ఎందుకా కచేరీలు? అవన్నీ మాకు బాగుండేవిగా అనిపించటంలేదు. అక్కడ సంగీతం మాత్రం శాస్త్రబద్ధంగా ఉంటుంది.. తక్కినవన్నీ కాలుష్యమే. వాళ్లకు సంగీతం ఒక సీజన్‌లో బతుకు మార్గం.. లేదంటే ఒట్టి కాలక్షేపం. ఉత్సవం.. మేళా! మనకేమో అన్నీనూ.. జీవన సర్వస్వం అన్నా తప్పుకాదేమో? జీవితాలు ముగిసిపోయాక కూడా మా సంగీతం జీవిస్తుంది. త్యాగబ్రహ్మ ఇప్పుడు జీవిస్తున్నారా- లేరా? మా తలరాత కొద్దీ ఇప్పుడు మేము నోరు మూసుకుని పడుండేది ఆ రికార్డింగ్ థియేటర్లోనే! సంగీతం అక్కడ కాలుష్యం.. ఏదీ కూడా బాగా లేదు.. మాదేంపోయింది! అక్కడ రాత్రీపగలు ఎప్పుడైనా మాకు పనీ, చేతికి కూలీ దొరుకుతాయి. మన సంచారమే ఈ స్టూడియో పరిసరాల్లోనే.. స్టూడియో వదిలిపెడితే ఈ ఇల్లు.."

"మీరెన్నయినా చెప్పండి.. ఏదో బతకడానికి మనం వాయిస్తున్నాం. ఈ నాయాళ్లకు ఆవగింజంతయినా సంగీత జ్ఞానం ఉందా? లేదూ నేర్చుకోవాలన్న

> **కొత్తగాలి...**
>
> **ఆశ**
> **దురాశకు దారితీస్తోంది**
> **నిరాశ**
> **నిస్పృహని మిగులుస్తోంది**
>
> – మేడిచర్ల సూర్యప్రకాశరావు,
> రామరాజులంక, తూ. గో. జిల్లా

బుద్ధుందా? నిన్న వాయించిన ఆ ప్రముఖ మ్యూజిక్ డైరెక్టర్‌ను పట్టుకుని అడిగాను.. 'ఏంటిసార్, ఇది శుభపంతువరాళిని బేస్ చేసుకునేగా కంపోజ్ చేశారు' అని. వాడు నన్ను పక్కకు తీసుకెళ్లి రెండు చేతులెత్తి నమస్కరించి 'స్వామీ, ఈ విధంగా ఏదో కసాబిసా అని అందరి ముందూ అడుగుతున్నారే? నేను ఏ పంతువరాళినీ నేర్చుకున్నవాణ్ణి కాను. ఉత్తినే ఏదో వినికిడి జ్ఞానం మాత్రమే నాది' అని నీళ్లు నమిలాడు. మన తలరాత అన్నారే, అది నూటికి నూరుపాళ్లూ నిజం.. వాళ్లదగ్గర నోళ్లు మూసుకుని,

సంగీతానికి ద్రోహం చేస్తున్నాం" అని తబలా సుందరం చేదుమాత్ర మింగినట్లు ముఖంపెట్టి అన్నాడు.

"ఛీఛీ! మనకేంటి ఈ మోసాలతో సంబంధం? మన సంగీతం మనతోటే ఉంది. నో వన్ కెన్ కరప్ట్ మ్యూజిక్.." అన్నారు రామదురై.

"కళాకారులమైన మనం.." అంటూ ఇంకేదో చెప్పటానికి ప్రయత్నించి కొడుకు వైపుకు తిరిగి అన్నారు, "మేము- మేమంటే నేనూ ఈయన, ఆయన.. కొంతకాల క్రితం కన్ను మూసిందే నాటకాలేసే నటి పుష్పా.. మేమందరమూ మీ కంటికి

## కొత్తగాలి...

**దేహముంది కానీ**
**ప్రాణాలే లేవు**
**ఎందుకంటే**
**నువ్వేగా నా ప్రాణం**

– వాడపర్తి వెంకటరమణ,
విశాఖపట్నం

సామాన్యంగానే కనిపిస్తాం. నిజానికి మేము దాన్ని ఇష్టపడే జీవిస్తున్నాం. నాముందు రెండు రకాలైన మార్గాలు వేరు పడ్డాయి. మనుషులందరూ ఏదో ఒక ప్రాయంలో అలాంటి ఒక కూడలిలో కొచ్చి నిలబడాల్సిందే. ఇప్పుడు నువ్వు కూడా అలాంటి చోటికి వచ్చావు.. ఒక ఉదాహర ణకు మాత్రమే నిన్ను చెప్పానంతే.. నాకున్న రెండు మార్గాలను గురించి చెప్పాలకుంటున్నాను. ఒకటి మీ అమ్మకు భర్తగా, ఒక ధనవంతుడికి అల్లుడిగా ఉండిపోవటం.. ఉత్తినే ప్యాషన్‌కు వయొ లిన్ పట్టుకుని కళాకారుడిగా సమాజంలో పేరు ప్రతిష్ఠలు సంపాదించి, పతకాలూ బిరుదులూ అందుకుంటూ తృప్తిగా బతికి, చనిపోవటం.. ఎలా బతికినా అదేగా ముగింపు? ఇదొక మార్గం. ఇంకో మార్గం.. వీళ్లతో కలిసి వీళ్లలాగే కష్టప డుతూ, జీవితంలో దెబ్బలు తిని, నిత్య పోరాటంగా జీవితాన్ని మార్చుకుని, ఆ జంజాటంలోనే బతికి చావటం.. ఇందులో ఏదీ కూడా మన ఇష్టప్రకారం ఏర్పడేది కాదు" అని చెప్పి ఆయన కాసేపు ఆలో చనలో పడ్డాడు.

అప్పుడు ఆయనకు అడ్డుపడి ప్రశ్నిం చాడు ప్రకాశం "ఇష్టమైనది జరగనప్పుడు తలరాత అంటున్నారా నాన్నా? "

"నువ్వు తలరాతను నమ్మేటట్టుంటే అంతే! అందరూ నమ్మవలసిన తలరాత ఒకటుంది. దాన్ని 'సామూహిక తలరాత' అని చెప్పవచ్చు. కళాకారులమైన మాకు దాన్ని అతిక్రమించగల మార్గమూ, అందుకు లోబడి ఉండే మార్గమూ కూడా ఉన్నాయి. అది ఆ సమూహానికి సంబం ధించినది. మేము అంటే నేను, పుష్ప, మాలా జీవించేవాళ్లు- ఆ తలరాతను అతి క్రమించిన వాళ్లమేగా? "

"ఏం ఆ సామూహిక తలరాతను మార్చుకోగల శక్తి కళాకారులైన మీ చేతుల్లో లేదా? " అని ప్రకాశం ఇంగ్లీషులో ప్రశ్నించాడు.

నాన్న అందుకు సమాధానమిచ్చే ముందు ఎంతగా నవ్వాడని!

"లేదు నాయనా.. ఇటీజ్ నాట్ ఇన్ అవర్ హ్యాండ్స్! అలా అనుకుంటే.. అదొక భ్రమే అవుతుంది. ఆన్ ది కాంట్రరీ.. మే మూ ఈ సమాజం చేతిలో చిక్కుకున్న వాళ్లమేగా" అని కొడుకుతో ఇంగ్లీషులో చెప్పి, తన స్నేహితుల్ని చూస్తూ తమి ళంలో అడిగారు "మన చేతుల్లో ఏముం దయ్యా.. నా చేతిలో ఉన్న విల్లు (బౌ) నుండి సంగీతమేగా వస్తుంది.. ఇంకేం

వస్తుంది? మన వాయిద్యాలను ఉంచుకుని ఆకలి పోరాటం చెయ్యగలం.. జీవితాన్ని ఎదిరించి పోరాడగలమా? "

ఆ ముగ్గురు స్నేహితులూ ఆయన అభిప్రాయంతో పూర్తిగా ఏకీభవిస్తున్నట్టూ, ఆయన చెప్పేదంతా ఆమోదిస్తున్నట్టూ తలాడించసాగారు.

"నా కొడుకును చూసిన ఆనందంలో ఆపకుండా మాట్లాడేస్తున్నా" అని రామదురై వారితో తన పరిస్థితిని వివరిస్తున్నట్టు చెప్పారు.

తబలా సుందరం ఇలా అన్నాడు, "మీరు ఇలా మాట్లాడగా విని ఎంతకాలమైంది? పుష్పా అమ్మగారు పోయాక- ఈ రెండునెలలుగా మేము రోజూ చూస్తూనే ఉన్నాంగా- మీరెక్కడ మాట్లాడుతున్నారు? మీరు అప్పుడప్పుడూ ఇక్కడికి రండి తమ్ముడూ.. నాన్నకు సంతోషంగా ఉంటుంది.." అన్నాడు ప్రకాశంతో.

"కాస్త ఇలా పక్కకొస్తారా? " అని నాన్నను గదిలోకి తీసుకెళ్లి ఏదో రహస్యం మాట్లాడాడు తబలా. దానికి జవాబుగా నాన్న నవ్వుతున్న శబ్దం బయటికి వినిపించింది.

"దానిదేముంది? నేను తాగటం ఊరికంతా తెలిసిన విషయం. కొడుక్కు తెలిస్తే ఏం? " అంటూ ఆయన అనటంతో ఆ ముగ్గురు మిత్రులూ తన నిష్క్రమణం కోసం ఇంతసేపూ కాచుక్కూచున్నారని అర్థం చేసుకున్న ప్రకాశం గదిలో నుండి బయటికొచ్చిన తండ్రితో అన్నాడు. "మీకేమైనా ముఖ్యమైన పనులున్నాయా? నేను బయలుదేరనా? "

"నోనో..! ఉడ్ యు మైండ్ అవర్ డ్రింకింగ్? " అంటూ తబలా సుందరం తీసుకొచ్చిన బాటిల్‌ను తీసుకుని, గదిలో పరిచి ఉన్న జమకాళం మధ్యలో పెట్టాడు.

ప్రకాశం చేతి గడియారంకేసి చూశాడు. గంట ఆరు కావస్తోంది. తండ్రి అంటే అతడికున్న అర్థంలేని భయం, సిగ్గూ ఇప్పుడు మంచుగడ్డలా మెల్లమెల్లగా కరిగిపోసాగింది.. కనుమరుగైంది. తండ్రి సహజ సిద్ధమైన స్వభావానికి మురిసిపోతూ ఇంకాసేపు అక్కడే ఉండి ఆయన మాటలను వినాలనిపించింది.

కాసేపటి క్రితం ఆయన సుందరంతో చెప్పిన విషయాన్ని అంగీకరించేలా నవ్వుతూ మళ్లీ కూర్చున్నాడు ప్రకాశం. స్నేహితులను పిలుచుకొచ్చి గదిలోపల పరిచిన జమకాళం మీద కూర్చునేలా చేశారు.

"ప్రకాశం.. నువ్వు లోపలికెళ్లి ఇల్లును చూడకూడదూ? " అన్నారు తండ్రి.

ఒక్క గది మాత్రమే ఉన్న ఆ ఇంట్లోపలి భాగం విశాలంగానూ, పూరి కప్పు ఉన్నందువల్ల చల్లగానూ అనిపించింది. దాని వెనక వంటగదిలాంటి గది కనిపించింది. ఇంటిచుట్టూ పూలమొక్కలు ఉన్నాయి.

అతడు ఇంటిని చూస్తుండగా 'నా కొడుకు ఆనందమయమైన వైవాహిక జీవితం కోసం' అంటూ ఇంగ్లీషులో తండ్రి తనకు శుభాకాంక్షలు చెప్పడం విని వెనుదిరిగాడు ప్రకాశం. ఆయన అతడికేసి చూస్తూ కనుబొమలు పైకెత్తి నవ్వుతూ మందు పుచ్చుకున్నారు.

ఆయన స్నేహితులు ముందుగానే తీసుకొచ్చిన జీడిపప్పు, వేరుశెనక్కాయ గింజలు, కారాబూందీ అలా ఒక్కో పొట్లంగా విప్పదీసి ప్లేట్లలో కుమ్మరించారు.

"రా.. ఇందులో నువ్వూ భాగం పంచుకోవచ్చు" అని ప్రకాశానికి తినుబండారాలను చూపిస్తూ ఆహ్వానించారు రామదురై. ప్రకాశానికంటూ వేరుగా ఒక ప్లేటులో పట్టుకొచ్చి అందించాడు 'ఆల్ రౌండర్ శేఖర్' అతను అప్పటివరకూ ఒక్కమాట కూడా మాట్లాడలేదని గ్రహిం

చాడు ప్రకాశం.

"థాంక్స్" అంటూ ప్లేటును తీసుకున్నప్పుడు కూడా అతను చిర్నవ్వు మాత్రమే చిందించాడు.

తండ్రి, ఆయన స్నేహితులూ జమకాళం మీద సౌకర్యంగా కూర్చున్నారు.

ప్రకాశానికి ఇదంతా కొత్త అనుభవంగా అనిపించింది. తన స్నేహితులలో కొందరు మందు కొట్టడం, ఎప్పుడైనా పార్టీ చేసుకోవడం కద్దు. అలాంటి సందర్భాలలో ముందుగానే వాళ్ల ప్రయత్నాన్ని గ్రహించి, వాళ్ల నుండి తప్పించుకుని వెళ్లిపోయేవాడు ప్రకాశం.

పసితనంలో ఏర్పడ్డ భయమూ, దాని ఫలితంగా తన తల్లిదండ్రులు విడిపోయిన సొంత జీవితంలో ఏర్పడ్డ బాధా, అతణ్ణి దాని ప్రభావం నుండి దూరం చేసినా, మందుకొట్టే ఇతర స్నేహితుల గురించి ప్రకాశం ఎలాంటి చెడు అభిప్రాయాన్నీ కలిగి ఉండలేదు.

ఇప్పుడు వీళ్లు- అందరూ యాభై ఏళ్ల వయస్సు పైబడిన పెద్దవాళ్లు. జమకాళం పరిచి నేలమీద గుండ్రంగా కూర్చుని మధ్యలో బాటిలూ, గ్లాసులూ పెట్టుకుని కూర్చుని ఉండటం కూడా వాళ్లేదో సంగీతం రిహార్సల్స్ చేసుకుంటున్నట్టుగా ప్రకాశానికి అనిపించింది.

నడుముకు పంచె కట్టుకుని, భుజాలను కప్పుతూ ఓ కళాకారుడికి అతికినట్టుగా ఉన్న పద్ధతిలో వేసుకున్న పలుచటి అంగ వస్త్రంతో ఉన్న తండ్రి వాలకం ఎంతో గంభీరంగా అనిపించింది. 'ఈయన దేనికీ బాధపడే వ్యక్తి కాదు. బాధపడిందీ లేదు. ఈయన ముఖంలో ఏర్పడ్డ ముడుతలు వృద్ధాప్యం ఆనవాళ్లే కానీ, అవి బాధలవల్ల ఏర్పడినవి కావు. మనుషుల ఎడబాటో, మరణమో ఆయనను శోకంలో ముంచలేవు. అయితే ఆయన ఎంతో జాగ్రత్తగా జీవితంలో పోరాడి ఎదిగిన మనిషి. ఇలాంటి తండ్రి గురించి నేను గర్వపడొచ్చు!' ఇలా తనలో తాను అనుకుంటూ వికసిత వదనంతో కూర్చున్నాడు ప్రకాశం.

తండ్రి కళ్లు మూసుకుని, సన్నటి గొంతుతో శ్రుతి చేస్తున్నట్టు 'మ్...' అని కాసేపు ప్రాణాయామం చేసే మనిషిలా ఉన్నవాడు ఏదో రాగాన్ని ఆలాపించాడు.

ప్రకాశం రాగం, తాళం ఇవన్నీ ఏమీ తెలియని వ్యక్తి. అళగమ్మాళ్ అయినా ఏవో కొన్ని రాగాల పేర్లను తెలుసుకుని బాగా ఆలోచించి చెప్పేది. ప్రకాశానికి ఇది కూడా తెలియదు. గతంలో అతడు అప్పుడప్పుడు కచేరీలకు వెళ్లటం రామదురై కోసమే. ప్రత్యేకించి రసానుభూతి కోసం అతనింతవరకూ ఏ సంగీతాన్నీ ఆస్వాదించింది లేదు.

"ఏ రాగం?" అంటూ కళ్లుతెరిచి నవ్వుతూ ప్రశ్నించారు రామదురై. తనను అడుగుతున్నారేమోననుకున్న ప్రకాశం "అయాం సారీ.. నేను మీ కోసమే సంగీతాన్ని ఆస్వాదిస్తున్నాను. అయితే మిమ్మల్ని మరిచిపోయి ఆస్వాదించాను"

రామదురైకు ఒళ్లు పులకరించింది. ఆయన దృష్టి ఎక్కడో నిలిపి గత జ్ఞాపకాలలో లీనమైపోయారు. ఆయనకు ఆశ్చర్యంగా అనిపించింది.

ఇలాగే చాలా ఏళ్లక్రితం అళగమ్మాళ్ కూడా తనతో అనటం లీలగా గుర్తుకొచ్చింది. అయితే ఒకటే తేడా. "సంగీతంలో మిమ్మల్నీ మీరు మరిచిపోతారే- అలా నాకు వీలుకాదు" అందామె.

"మీ అమ్మ సంగీతం వింటుందా?" అని ప్రశ్నించారు.

"ఎప్పుడైనా రేడియోలో.. అదీ మీ కచేరి అయితేనే.." అన్నాడు ప్రకాశం.

"ఆ రాగం ఉదయచంద్రిక కదూ?" అని అడిగాడు ఆల్ రౌండర్ శేఖర్. ఆయన



మాట్లాడిన మొదటిమాట ఇదే కాబోలని ప్రకాశం గుర్తుచేసుకున్నాడు.

"ఔను" అంటూ తలాడించి, పక్కనున్న షెల్ఫ్‌లో నుండి క్యాసెట్ ప్లేయర్‌ను బయటికితీసి ఆన్ చేశారు రామదురై. కాసేపటి క్రితం ఆయన ఆలాపన చేసిన అదేరాగం ఒక స్త్రీ కంఠం నుంచి జాలువారసాగింది. తంబూరాలోని శబ్దమూ, కంఠ మాధుర్యమూ మలయామారుతంలా తేలుతూ వచ్చి మనసును ఆహ్లాదపరుస్తోంది. తండ్రి వయొలిన్ అందుకుని భుజానికి ఆనించి పెట్టుకుని, కళ్లుమూసుకుని విల్లు(బౌ)ను ఆడిస్తుంటే పువ్వులు తలమీద కుమ్మరించిన అనుభూతి చెందాడు ప్రకాశం.

"మాకేలరా విచారమూ
మాకేలరా విచారమూ
మముగన్న శ్రీరామచంద్రా
మాకేలరా..."

తబలా సుందరం వద్ద తబలా లేదు. అయినా తొడమీద తాళం వేస్తూ కచేరికి నిండుదనం తెచ్చాడు. తండ్రి తనను తాను మరిచిపోయి వయొలిన్ వాదనలో లీనమైపోయారు. కచేరీ సమయంలో మధ్యమధ్యలో ఫ్లాస్కులో నుండి వొంపుకుని తాగుతారే, అదేవిధంగా గ్లాసులో నుండి మధువును నోట్లోకి వొంపుకున్నారు. కొన్నిసమయాల్లో టేపురికార్డర్‌లో నుండి జాలువారుతున్న గమకాలకు 'శెభాష్' అన్న ఉత్సాహపూరితమైన మెచ్చు

కోళ్లను గుప్పించసాగారు.

మళ్లీ వయొలిన్ గడ్డంతో అదిమిపట్టి, విల్లుతో వాయిస్తూ అందులో లీనమైపోసాగారు.

'మాకేలరా-' ముగించి కళ్యాణి రాగం ఆలపిస్తుండగా తండ్రిని మరిచిపోయి తనూ సంగీతంలో ఓలలాడసాగాడు ప్రకాశం.

"నిధి చాలా సుఖమా? .." అన్న త్యాగరాజు కీర్తన ముగిశాక అందరూ స్పృహలోకొచ్చినట్టు కళ్లు తెరిచి చూశారు.

"క్యాసెట్టును ఇంకోవైపు తిప్పి పెట్టరూ..? " అని తండ్రిని అడిగాడు ప్రకాశం.

సంగీతంలో మునిగిపోయిన తండ్రి కళ్లలో కన్నీళ్లు కనిపించాయి.

"వాట్ యాన్ ఆర్టిస్ట్ షి వాజ్" అని నిట్టూర్చి మధువు తాగారు.

"పుష్పా అమ్మగారినేగా అంటున్నది? " అని ఆమెను గుర్తుకు తెచ్చుకుని రెండు చేతుల్నీ జోడించి నమస్కరిస్తూ అడిగాడు తబలా సుందరం. తండ్రి ఎంతో గొప్పగా "ఔను" అంటూ తలాడించారు.

తరువాత క్యాసెట్టు వెనకవైపు నుండి మోహన, తర్వాత సహానా. రెండు రాగాల్లోనూ ఆలాపన, కీర్తన... తండ్రి వయొలిన్ విన్యాసమూ అంతా కలిపి రెండు గంటల కచేరీ విన్నామన్న సంతృప్తీ, సంతోషమూ కలిగాయి వాళ్లందరికీ.

కాసేపటి క్రితం తండ్రి చెప్పిన విషయాన్ని అందరూ గుర్తుకు తెచ్చుకున్నారు.

"నో వన్ కెన్ కరప్ట్ మ్యూజిక్! మన సంగీతం మనతోటే ఉంది!"

ఆ గానామృతాన్ని కురిపించిన, ఇకపై చూడలేని, తండ్రి జ్ఞాపకాల్లో మాత్రమే జీవిస్తున్న- ఆ పుష్పా ఫోటోనైనా చూడాలని గదిలోని గోడను వెదుకులాడసాగాయి ప్రకాశం కనులు. అక్కడ అలాంటి ఫోటోలేవీ కనిపించలేదు. ఓ మూలన పూజగదిలాంటి చోట తంబూరా, ఓ పాత కాలం నాటి త్యాగబ్రహ్మం- తంజావూరు మోడల్ - ఓ పటమూ కనిపించాయి. అవి కచ్చితంగా తండ్రివి కాకపోవడం చేత, ముఖం తెలియని ఆ పుష్పను అందులో దర్శించుకొని చేతులెత్తి నమస్కరించాడు ప్రకాశం.

'బి ఎ గుడ్ సన్' అని తల్లి పదేపదే చెప్పేది ఆ మాటలను గుర్తుకు తెచ్చుకున్నాడు.

'అమ్మ ఎదురుచూస్తుంటుందేమో? ' అన్న ఆలోచన కలగడంతో తండ్రిని కలుసుకున్న అనుభవాన్ని త్వరగావెళ్లి ఆమెకు వివరించాలన్న ఆత్రుతతో రిస్ట్‌వాచ్‌లోకి తొంగిచూశాడు ప్రకాశం.

గంట తొమ్మిది కావస్తోంది.

## 4

**"మీ** నాన్నను వదిలి రావటానికి నీకు మనసు రాలేదా? .. ఏంటీ గంట పదవుతోందని చూస్తుంటే.. నువ్వు బస్సులోంచి కిందకి దిగుతున్నావు" అంటూ పరిహాసంగానూ, సంతోషంగానూ కొడుకును లోపలికి ఆహ్వానించింది అళగమ్మాళ్.

"ఓహ్! నాన్నగారూ ఈజ్ సో గ్రేట్" అని పారవశ్యంతో అంటూ లోపలికొచ్చాడు ప్రకాశం.

"నిజంగానే నాకు అక్కణ్ణించి బయలుదేరి రావటానికి మనసే రాలేదమ్మా! నువ్వు నాకోసం ఎదురుచూస్తూంటావని వాచ్‌కేసి చూస్తే టైమ్ తొమ్మిదైంది.." అని అలవాటు కొద్దీ వివరణ ఇస్తూ మెట్లెక్కి వెళుతున్న కొడుకు వెనకే నడుస్తూ తల్లి అడిగింది "ఎలా ఉన్నారు? .. ఏం చెప్పారు"

గతంలో చెప్పేవాడే- 'నిండుకుండలా ఉన్నారు?' అని పరిహాసం చేస్తున్నట్టు - ఆ విధంగా ఇప్పుడు తండ్రి గురించి చెప్పటం ఆయన్ను అగౌరవ పరిచినట్టు అవుతుందనిపించింది అతనికి.

"చాలా బావున్నారు. ఒంటరిగానే ఉంటున్నారు. ఆ అమ్మ రెండునెలల క్రితమే కాలధర్మం చెందారట.." అని తల్లి ముఖంలోకి చూశాడు ప్రకాశం.

"అయ్యో పాపం!" అని ఎవరో పరాయి వ్యక్తి గురించి బాధపడ్డట్టు అంది అళగమ్మాళ్.

డైనింగ్ టేబుల్ వద్ద భోజనం చేస్తుండగానే తల్లీ కొడుకులిద్దరూ ఎక్కువసేపు మాట్లాడుకోవడం అలవాటు. తల్లి వడ్డిస్తూ కొడుకు చెప్పే విషయాలను వినేది. కొడుకు భోజనం పూర్తయ్యాక తనకు వడ్డించుకుని ఆమె భోజనం పూర్తయ్యేంత వరకూ అతడూ ఏవేవో మాట్లాడుతూ అక్కడే కూర్చునేవాడు. అందుకే భోజనం చేసే టేబుల్‌పై కంచం పెట్టి కొడుకు వచ్చి చెప్పబోయే విషయాలను వినటానికి ఆత్రుతగా ఎదురుచూస్తోంది అళగమ్మాళ్.

తన గదిలో నుంచి లుంగీ, బనియన్ ధరించి డైనింగ్ టేబుల్ వద్దకు వచ్చి కుర్చీని దగ్గరకు లాక్కుని కూర్చున్నాడు ప్రకాశం.

"అమ్మా..." అని ఏదో గుర్తుకొచ్చి ఆనందంగా తల్లిని పిలిచాడు.

"ఆయన నాకు తండ్రే. నేను ఆయనకు కొడుకునే! అయితే, మనం వేరే 'క్లాసు', ఆయన వేరే 'క్లాసు'.. పవిత్రమైన క్లాసు.. అంతే!" అని ఇంగ్లీషులో చెప్పిన ప్రకాశం కళ్లలో ఏదో చెప్పలేని వెలుగు కనిపించింది.

"చాలా చిన్నఇల్లు.. అద్దె ఇల్లు కాబోలు.. ఎంతో నీట్‌గా, అందంగా, శుభ్రంగా ఉంది. ముందు భాగాన చిన్నదిగా ఒక గార్డెన్, పూరికప్పు, సిమెంటు గోడలు, ఒక గది- అదే లివింగ్ రూమ్! వెనక వంటగది- ఇంటిచుట్టూ పూల మొక్కలు.. ఆ ప్రాంతమంతా సందడి సందడిగా ఉంది. అయితే అప్పుడే అనుకున్నాను. నిజాయితీగా ఆలోచిస్తేనూ అమ్మా ఇక్కడేగా, ఈయనతోటేగా, ఈ గుడిసెలోనేగా ఉండాలి" అని చెప్పి తల్లి ముఖంలోకి చూశాడు.

"దేవుడు చల్లగా చూడబట్టి సరిపోయింది.. భగవంతుడు మనల్ని కాపాడాడు" అని మొక్కింది అళగమ్మాళ్. ఆమె

> ## కొత్తగాలి...
>
> **జననం**
> **మరణం**
> **నడుమ**
> **నరకం**
>
> – యు. చిట్టిబాబు,
> న్యూపాల్వంచ, ఖమ్మం జిల్లా

ఏమంటోందో అర్థంగాక నుదురు చిట్లించాడు ప్రకాశం.

తల్లి అంది "అవన్నీ ఆలోచించేగా- మనం ఆ రొంపిలో కూరుకుపోకూడదనేగా తప్పుకోవటం ఉత్తమమని భావించాను?.. ఆయనకు అది సరిపోతుంది. ఆయన కళాకారుడు. ఎక్కడున్నా ఆయనకు దక్కాల్సిన గౌరవం దక్కుతుంది. నేను ఆయనకు భార్యగా ఉన్నా, నువ్వు ఆయనకు కొడుకుగా ఉన్నా- ఆయనలా గౌరవంగా బతకడానికీ వీలవుతుందా? మనం అప్పుడు.. ఇప్పటిలాకాక వేరే మనుషుల్లా ఉండేవాళ్లం. అది మనకు ప్రత్యేకంగానో, గౌరవంగానో ఉండేది కాదు కదూ?" అని, కొడుకు తన భావాలను ఎక్కడ తప్పుగా

అర్థం చేసుకుంటాడోనన్న భయంతో- "కట్టుకున్న భర్త చేసే తప్పులన్నింటినీ భరిస్తూ తననూ, తనకొడుకు జీవితాన్నీ నాశనం చేసుకోవటానికి ఏ స్త్రీకీ హక్కు లేదు. ఆమె ఒక అర్థంలేని భార్యగానూ, కష్టాలను భరించే తల్లిగానూ మారిపో తుంది.. అందుకే ఆయన వేరే క్లాసూ; మనం వేరే క్లాసూ.. ఏంటీ, అంతేనా? " అంటూ తెలివిగా ముగించింది.

"సరే, నీ ఆలోచనలు అలా ఉండనీ.. ఎన్ని గంటలకు వెళ్లావు? ఆయన ఎలా రిసీవ్ చేసుకున్నారు? ఆ విషయాలన్నీ చెప్పు" అని అడుగుతూ అతడికి వడ్డిం చింది.

"నేను వెళ్లినప్పుడు సమయం నాలు గయి ఉంటుంది. నాన్నతో పాటు ఆయన స్నేహితులు మరో ముగ్గురున్నారు.. చాలా మంచివాళ్లు.. నన్ను చూసిందే లేచి వచ్చి నా చెయ్యి పట్టుకుని లోపలకి తీసు కెళ్లి వాళ్లకు 'మై సన్' అని గొప్పగా పరి చయం చేశారు. వాళ్లకు ఏమీ అర్థంగాక గుడ్లు తేలేశారు.. తర్వాత కాస్సేపటికి అందరికీ అర్థమైంది.. అమ్మా! పుష్పా అని ఒక అమ్మ ఉండేదటగా.. ఆమె గొంతునీ, పాడిన పాటల్లో రెండు మూడింటినీ రికా ర్డుచేసి పెట్టుకుని ఉన్నారు. దాన్ని వినిపిం చారు.. ఓహ్.. ఎంత గొప్ప వాయిస్.. ఎంత సుఖం! అమ్మా నువ్వూ వినాలి.. నాన్న వయొలిన్ వాయించారు.. 'కేసెట్' పాటకు పక్కవాద్యంగా వయొలిన్ వాయించారు.. సమయం గడిచిందే తెలి యలేదు.." అంటూ పొగుడుతున్న కొడుకు అనుభవాన్ని వింటున్న కొద్దీ మైమరచిపోయింది అళగమ్మాళ్. ఆయ నకు తల నెరిసిపోయిందనో, వయసు మీద పడిందనో ఇంకొకరి ద్వారా విన్నా, ఆమె మనసులో రామదుర్తై రూపం, ఇదిగో ఎదురుగా కూర్చుని ఆయనను పొగుడుతున్నాడే ఇతడిలాగే ఒక యువ కుని రూపమే ఆమె మదిలో కదలాడసా గింది.

భోజనం తర్వాత ప్రకాశం తన గదిలోకి వెళ్లిపోయాడు. గదిలో బల్బు వెలుగుతూ కనిపించింది. నిద్రపొయ్యే ముందు ఏదైనా చదువుకోవటం అతడికి అలవాటు.

వంటగదిలో ఏదో పని చేసుకుంటూ, ఒంటరిగా ఏవేవో ఆలోచనల్లో మునిగి పోయి పనిని మరిచిపోయి నిలబడిపో తోంది అళగమ్మాళ్. ఎక్కడో దూరం నుండి వయొలిన్ సంగీతం గాల్లో తేలుతూ వచ్చి ఆమెను పెనవేసుకున్నట్టని పించింది.

చాలా సేపటి నుండి తల్లి వంటగదిలో ఉండటం చూసి, గదిలోని బల్బును ఆఫ్ చేసేందుకు లేచి, ఆమెకు గుడ్‌నైట్ చెప్ప టానికి హాల్లోకి వచ్చాడు ప్రకాశం.

"నీ పెళ్లి విషయంగా ఏం చెప్పారు? నువ్వన్నీ వివరంగా చెప్పావా? " అని అడి గింది- అవే ఆలోచనల్లో ఉన్న అళగ మ్మాళ్.

"చెప్పాను. ఆయనెంతో సంతోషించారు. మిమ్మల్నెంతో పొగిడారు. మీరు ఆయ నను కచ్చితంగా రమ్మన్నారని చెప్పాను. ఆయన తప్పకుండా వస్తారు"

"అది సరే! అమ్మాయి గురించీ నువ్వేమీ చెప్పలేదా? "

"ఇకపై నేను అప్పుడప్పుడూ అక్కడికి వెళతాగా. అప్పుడన్నీ వివరంగా చెబు తాలే.. ఇవ్వాళ ఎవరెవరో.. వేరే విషయా లన్నీ మాట్లాడ్డం వల్ల తర్వాత సంగీత కచేరీ కూడా జరిగింది.. సమయం ఇట్టే గడిచిపోయింది.."

'ఆయన ఇరవై ఏళ్ల తర్వాత ఈ ఇంటికి రాబోతున్నారు' అన్న ఊహ ఆమె మన సును ఆవరించింది. ఎక్కడి నుంచో నిజం గానే ఒక వయొలిన్ సంగీతం ఆ రాత్రి

పూట అలా అలా తేలుతూ రావటాన్ని వాళ్లిద్దరూ మైమరచి విన్నారు.

## 5

మిస్టర్ మీనన్ దుబాయి నుండి వచ్చేశారు. ఆయన తన కూతురి పెళ్లికి తగ్గ ముందు ఏర్పాట్లతోటే వచ్చారు. ఆయన ఇంట్లో పిల్లలందరూ పండుగ రోజులా రకరకాలైన దుస్తులు ధరించి ఆయన రాకను సెలబ్రేట్ చేసుకోసాగారు.

మీనన్‌కు అంతకు మునుపే ప్రకాశం గురించీ, అతని కుటుంబం గురించీ తెలుసు. గతంలో అళగమ్మాళ్ తండ్రి ఎంతో గొప్పస్థాయిలో ఉన్నప్పుడు అదే వీధిలో ఒక సాధారణ వ్యక్తిగా, అదే ఇంట్లో ఒక పోలీస్ కానిస్టేబుల్ కొడుకుగా పుట్టి పెరిగారు ఆయన. అళగమ్మాళ్‌కు రామదురైకు జరిగిన పెళ్లి ఊరేగింపు కూడా ఆయనకు గుర్తుంది.

వాళ్లది ఎంతో పెద్ద కుటుంబం కావటం వల్లనూ, వాళ్లకు తగ్గట్టు ఆడంబరంగా తన కూతురికీ గొప్పగా వివాహం చెయ్యాలన్న ఉద్దేశంతో ఏకంగా ఒక పెద్దమొత్తాన్ని తన వెంట తీసుకొచ్చారు మీనన్.

ఇక్కడికొచ్చి అళగమ్మాళ్‌తో మాట్లాడాక, ఆయన అనుకున్న దానికి భిన్నంగా ఆమె సింప్లిసిటీని ఇష్టపడే మనిషిగా ఉండటం గమనించాడు.

"కుల, మత ఆచారాల ప్రకారమైతే అలాంటి ఆడంబరాలను సహించి తీరాలి. ఇప్పుడు మనం జరపబోయే ఈ మతాంతర వివాహానికి అవన్నీ సరిపడవు" అని చెప్పేసింది.

మీనన్ దంపతులకు అళగమ్మాళ్‌లోని ఆధునిక భావాలు మరోరకంగా ఆనందాన్ని కలిగించాయి.

పెళ్లికి తేదీని నిర్ణయించారు. రిజిస్ట్రారును రప్పించో, అక్కడికే వెళ్లో వివాహాన్ని రిజిస్టర్ చేయించాలని, తాళికట్టి దండలు మార్చుకునే సంప్రదాయాలన్నీ ఏదో ఒక గుడిలో పెట్టుకుని, అళగమ్మాళ్ ఇంట్లో రిసెప్షన్, విందూ ఏర్పాటు చేయాలని నిర్ణయించారు.

ఇక్కడ జరుగుతున్న విషయాలన్నింటినీ రామదురైకు వెళ్లి చెప్పటానికీ, ఆయన అనుమతి తీసుకోవటానికీ తండ్రి వద్దకు పదేపదే వెళ్లి వస్తున్నాడు ప్రకాశం.

అంతేకాక ప్రకాశానికో, అళగమ్మాళ్‌కో వివాహ విషయంగా ఏ పనీ పెట్టకుండా అన్ని బాధ్యతలనూ మీనన్ తానే చూసుకోసాగాడు. మీనన్ ఇల్లు చిన్నది కావటం చేత రిసెప్షన్, విందు పెళ్లికొడుకు ఇంట్లోనే ఏర్పాటు చేయాలన్న మీనన్ ఆలోచనను ప్రకాశం రామదురైకు చెప్పినప్పుడు ఆయన కాస్త వెనకాడారు.

ఒకప్పుడు ఆ ఇంటి తలుపులు తన కోసం తెరుచుకోవడానికి నిరాకరించిన సంఘటన గుర్తుకొచ్చింది. అలాంటి ఒక సందిగ్ధావస్థ తల్లికి కూడా ఉండటంతో ఈ పెళ్ళిని ఒక సాకుగా చేసుకుని దాన్ని దూరం చేద్దామనుకున్నాడు ప్రకాశం.

ఆ విషయం చెప్పాక ఆయన చాలాసేపు మౌనంగా ఆలోచిస్తూ తల వంచుకుని ఉండటం చూసి కలవరపడ్డాడు ప్రకాశం.

"ఏంటి ఆలోచిస్తున్నారు.." అని అడిగిన ప్రకాశంకేసి తల పైకెత్తి చూశారు రామదురై.

ఇరవై ఏళ్లక్రితం "మీకేంటీ వేరే ఇళ్లా లేవు? ఇది అలాంటి ఇల్లుకాదు; నేనూ అలాంటిదాన్నికాను" అని కోపంతోనూ, అసహ్యంతోనూ అళగమ్మాళ్ అన్న మాటలు అతడి చెవిలో లీలగా ప్రతిధ్వనించాయి. ప్రకాశంకేసి చూస్తూ 'నీకు అవన్నీ తెలిసుండవు' అన్న ఆలోచనతో చిరునవ్వు

నవ్వారు.

తన అయిష్టాన్ని తెలియజేయటమో, వాళ్ల ఆలోచనలకు అడ్డుచెప్పటమో, మార్పులు చెయ్యటమో రామదురై లక్ష్యం కాకపోయినప్పటికీ ఆ ఇంటికి వెళ్లటం గురించి ఆయనకు ఒక విధమైన సంకట పరిస్థితి ఏర్పడింది.

"ఇదిగో చూడు ప్రకాశం.. ఇందులో నాకు సంతోషమే తప్ప మరెలాంటి బాధ్యతా లేదు. జరగబోతున్నది నా కొడుకు పెళ్లి. వాడికి నచ్చిన అమ్మాయిని వాడు వివాహం చేసుకోవాలి. అమ్మాయి ఎవరైతేనేం? వివాహం ఎక్కడ, ఎలా జరిగితేనేం? అన్నీ నాకు సంతోషాన్నిచ్చే విషయాలనే నువ్వు నాకు రోజూ చెబుతున్నావు. దీనికంతటికీ మీ అమ్మకు నేనెలా కృతజ్ఞతలు చెప్పాలా అని ఆలోచిస్తున్నాను" అన్నారు.

కొద్ది రోజుల్లోనే ఆహ్వాన పత్రికలను నేరుగా ప్రింటింగ్ ప్రెస్ నుండి రామదురై వద్దకు తెచ్చాడు ప్రకాశం.

ఆ పార్సిల్‌ను విప్పదీసి ఒక పత్రికను తీసుకుని కళ్లద్దాలను తుడిచి పెట్టుకుని చదివారు. ఆహ్వాన పత్రికలో రామదురై పేరుతో ఆహ్వానించేలా ఉన్న అక్షరాలు పొందికగా ఉన్నాయి. ఇంగ్లీషులో ఉన్న భాగంలో 'మిసెస్ అండ్ మిస్టర్ రామదురై కృతజ్ఞతలు' అంటూ తెలిపే వాక్యాలనంతా చదువుతున్నప్పుడు తాను ఒకవింత అనుభూతికి లోనుకావటం ఆయన గుర్తించారు.

కొద్దిరోజుల్లో తాను అళగమ్మాళ్‌ను కలుసుకోబోతున్నానన్న విషయంలో ఆయన మనసులో ఏదో కలవరపాటు, ఒక విధమైన న్యూనతాభావం కలగసాగాయి.

కాసేపటికంతా ఆయన స్నేహితులు ముగ్గురూ వచ్చారు. స్నేహితుల్ని పెళ్లికి ఆహ్వానించి ఆహ్వాన పత్రికలపై వాళ్లవాళ్ల పేర్లను రాసిచ్చారు.

"నాకు ఒక పది ఇన్విటేషన్లు చాలు.." అని ఆ పార్సిల్‌ను మునుపటిలాగానే కట్టారు.

తనకు చాలా పనుందని మరుసటిరోజు వస్తానని చెప్పి ప్రకాశం వాళ్ల దగ్గర నుండి సెలవు తీసుకున్నాడు.

పెళ్లికి ముందురోజు - అందరూ గుమిగూడి ఉన్న ఆ హాలు మధ్యన, ఎంతో ఒద్దికగా, రామదురై ఆశించినట్టే, ఎలాంటి అసహనానికీ తావులేకుండా, ఇరవైఏళ్ల తర్వాత అదే ఇంట్లో, అళగమ్మాళ్‌తో ఆయనకు ఆ కలయిక సంభవించింది.

ఆయనతోపాటు ప్రకాశం, మీనన్ వెంట రాగా ఆయన మేడమెట్లెక్కి రావటాన్ని హాల్లో ఆడవాళ్ల మధ్య కూర్చుని ఉన్న అళగమ్మాళ్ చూసింది. చూడగానే ఆమె లేచి నిలబడి, కూర్చునివున్న గుంపులో నుండి దారిచేసుకుంటూ బయటికొచ్చి ఆయనను ఆహ్వానించడానికి గుమ్మం వద్దకొచ్చి రెండు చేతులను జోడించి నిలబడింది. ప్రతిగా రామదురై నమస్కరించారు. అప్పుడు వాళ్లిద్దరూ భార్యాభర్తలన్న విషయం ఎంతో దూరమైపోయినట్టు అనిపించింది.

"రండి" అని అంటూ వాళ్లను లోపలికి తీసుకెళ్లింది అళగమ్మాళ్.

హాల్లోని సోఫాలో మీనన్, రామదురై కూర్చున్నారు. అక్కడున్న కొంతమంది మహిళలు మరో గదిలోకి వెళ్లిపోయారు.

తమిళమూ, మలయాళమూ మాట్లాడుతున్న కేరళ మహిళలూ, తమిళ స్త్రీలూ సరిసమానంగా అక్కడ సంగమమై ఉన్న అందాన్ని ఆస్వాదిస్తూ కూర్చున్నారు రామదురై.

తనను అనుసరించి లోపలికొచ్చిన ప్రకాశాన్ని ఏకాంతంలో రెండు చెంపలనూ స్పృశిస్తూ అతడి తల్లి కన్నీరు చిందిం

చింది.

“దీనికోసమే నాయనా.. నేను ఇంతకాలమూ ఎదురుచూసిందీ..” అని చెప్పి ఏదో భారాన్ని దించుకున్నట్టు సంతృప్తిగా నిట్టూర్చింది అళగమ్మాళ్.

అక్కడికొచ్చిన తమిళులందరూ అళగమ్మాళ్‌కూ రామదురైకూ దగ్గరి బంధువులుగానే కనిపించారు. అళగమ్మాళ్, ఆమె భర్తా విడిపోయి బతుకుతున్నారన్న విషయం వాళ్లందరికీ తెలిసుంటుంది. ఇవ్వాళ రామదురైను ఉన్నట్టుండి అక్కడ చూసిన చాలామందికి వాళ్లు ఇదివరకే ఒకటయ్యారేమోనన్న భావన కలిగేలా అళగమ్మాళ్ రామదురై ఇద్దరూ ఏ ఆవేశానికీ లోనుకాకుండా తమను తాము నిగ్రహించుకున్నారు. అయినప్పటికీ వాళ్ల హృదయాలలో వేర్వేరుగా సుడిగుండాలు సుళ్లు తిరగసాగాయి.

అనుభవమూ, వృద్ధాప్యమూ, జీవితంలో వేర్వేరు దృష్టీ కలిగిన ఆ ఇరువురూ ఒకరినొకరు తోడుగా భావించకుండా ఇప్పటివరకూ బతికారు. ఉన్నపళంగా ఒక కలయికలో ‘ఈయన నాకు తోడు’ అని ఆమెకో, ‘ఈమె నాకు తోడు’ అని ఆయనకో స్ఫురణకు రావటం కష్టంగానూ, సంకటంగానూ అనిపించింది! వాళ్లిద్దరూ తోడును పోగొట్టుకుని ఇద్దరు వ్యక్తుల్లా, ఒకరినొకరు మనసులోనే పశ్చాత్తాపంతోనూ, మర్యాద పూర్వకంగానూ చూసుకున్నారు, మాట్లాడుకున్నారు. ఎందరో గుమిగూడి ఉన్న ఆ పెళ్లి జనం మధ్యలో వాళ్లు ఇప్పటివరకూ ఒకటిగా జీవిస్తున్న దంపతుల్లాగానే ఒకరితో ఒకరు ప్రవర్తించసాగారు.

పెళ్లికుమార్తె తరపున మీనన్, పార్వతమ్మాళ్ ఏ విధంగా జంటగా కలిసి నిలబడ్డారో అదే విధంగా అళగమ్మాళ్, రామదురై జతగా నిలబడి నూతన దంపతుల నమస్కారాలను స్వీకరించి ఆశీర్వదించారు, అక్షింతలు చల్లారు.

# క్రిస్మస్ నిజాలు!

చతుర ప్రపంచం

★ క్రిస్మస్‌కు సెలవుని ప్రకటించిన మొదటి అమెరికన్ రాష్ట్రం అలబామా

★ ఏటా అత్యధిక శాతం మంది షాపింగ్ చేసే దినం క్రిస్మస్‌కి ముందు వచ్చే శనివారం

★ ఈ సీజన్‌లో వీసా క్రెడిట్‌కార్డును నిమిషానికి 5340 సార్లు వాడుతారు.

★ అమెరికా అధ్యక్షుడు రూజ్వెల్ట్ వైట్ హౌస్‌లోకి క్రిస్మస్ ట్రీలను నిషేధించాడు. అతని పిల్లలే వాటిని తమ గదుల్లోకి స్మగుల్డ్ చేశారు.

★ క్రిస్మస్ గ్రీటింగ్ కార్డులలో 23 శాతంపైన ఒక్క జంతువు బొమ్మయినా ఉంటుంది.




★ యూరోపియన్లకు ఈ సీజన్లో కుటుంబానికి సగటున 78 గిఫ్టులు అందుతాయి.

★ పదిహేను శాతం క్రిస్మస్ బహుమతులు ఇంట్లో చేసినవే.

★ అమెరికా ప్రజలు అవుట్‌డోర్ క్రిస్మస్ డెకోరేషన్స్ కోసం ఏటా 380కోట్ల డాలర్లు ఖర్చు చేస్తారు.

★ 34 శాతం మంది అమెరికన్లు తమ ఇళ్లని అలంకరిస్తారు.

★ ప్రపంచంలో మొదటిసారి క్రిస్మస్ ట్రీలకు కొవ్వొత్తులని అలంకరించింది జర్మన్లు.

★ సగటున అమెరికాలో ప్రతి నలుగురిలో ఒక పిల్లవాడు క్రిస్మస్‌కు తనకి ఫలానా బహుమతి కొనివ్వమని గొడవ చేస్తాడు.

★ సగటున క్రైస్తవుల్లో ప్రతి అయిదుగురిలో ఒకరు శాంతాక్లాజ్ నిజంగా ఉన్నాడని నమ్ముతారు.

చతుర ప్రవేశిక

## డిసెంబరు చతుర చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాయగలరేమో చూడండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. సత్యేన్ భార్య?
జ.
2. సులభ భర్త?
జ.
3. ముక్త ఎవరి ఆకర్షణలో పడింది?
జ.
4. ముక్త కుటుంబం ఏ ఊరికి మారింది?
జ.
5. అళగమ్మాళ్ భర్త పేరు?
జ.
6. ప్రకాశంను ప్రేమించిన మలయాళీ?
జ.
7. పార్వతమ్మాళ్ భర్త పనిచేసే దేశం?
జ.
8. ఆంధ్రాబ్యాంక్ వ్యవస్థాపకులు?
జ.
9. జాఫ్రీకి జ్ఞానపీఠం వచ్చిన సంవత్సరం?
జ.
10. ఎగతాళి ఏ దేశస్థుల స్వభావం?
జ.

పంపినవారి పేరు: ------------------

------------------వయసు (  )

చిరునామా: ------------------

------------------

------------------

పిన్‌కోడ్:  ఫోన్ నెం:

చిరునామా : సంపాదకుడు, విపుల, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

చివరి తేదీ 19

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

విపుల వినోదిని, చతుర ప్రవేశిక ఒకే కవరులో పంపవచ్చు.

రిజిస్ట్రార్ ఆఫీసులో సంతకం చేస్తున్నప్పుడూ, గుళ్లో జరిగిన వివాహ తంతు సమయంలోనూ ఆదర్శదంపతుల్లా నడుచుకున్నారు. వివాహం ఒక సామాజిక తంతు అయినట్టు, కొన్ని సమయాల్లో ఏర్పడ్డ శారీరక స్పర్శకూడా- ఇవన్నీ తన ఇష్టానుసారమే జరుగుతున్నట్టు అళగమ్మాళ్ గ్రహించింది. దీని కోసమేగా ఆమె ఇంతకాలమూ ఎదురుచూసింది. అయినప్పటికీ ఈ అనుభవం కొత్తదిగా అనిపించింది ఆమెకు.

మీనన్ ఎంతో సరదా అయిన మనిషి. రామదురైకు ఆ రెండు రోజులూ మీనన్ రాచమర్యాదలు చేశాడు. రామదురైకు మందు పుచ్చుకోవటం అలవాటేనని తెలుసుకుని, దానికి తగ్గట్టు తన ఇంట్లోనే ఏర్పాట్లుచేసి, పదేపదే ఆయనను వెంటబెట్టుకుని వెళ్లి సర్వ్ చేశారు మీనన్.

పెళ్లి రిసెప్షన్‌లో రామదురై వయొలిన్ కచేరీ జరిగింది. ఆయన స్నేహితులు ఆహ్వానపత్రిక అందుకున్న రోజునే ఈ కచేరీకి నిర్ణయం తీసుకున్నారు.

మెళ్లో పూలమాలలు, చేతుల్లో పూల గుచ్ఛాలతో ఆయనకెదురుగా కొడుకూ కోడలూ కూర్చున్న ఆనందమయమైన ఆ ఘడియలలో ఎప్పుడూ లేనంత ఉత్సాహంతో వాయించారు రామదురై.

మధ్య మధ్యలో ఫ్లాస్కులో నుండి మందు వొంపి రామదురైకు ఇస్తూ మీనన్ సపర్యలు చేశారు. రామదురై దాన్ని అందుకుని తాగుతున్నప్పుడు స్త్రీల మధ్య కూర్చున్న అళగమ్మాళ్‌ను వెదికాయి ప్రకాశం చూపులు. ఆమె కూడా దాన్ని అర్థం చేసుకున్న దృక్కులతో కొడుకును చూసింది.

'తాగటం కోసమో, తాగో ఇకపై మీరు ఇక్కడికి రాకండి, వెళ్లండి' అని ఇరవైఏళ్ల క్రితం ఆమె అరిచిన అరుపు- ఇప్పుడు ఆమె చెవులకు నవ్వుతున్నట్టుగా అనిపిం

చింది.

ఈ మందు వల్ల తమ బంధం తెగిపో వటమూ, ఆ తర్వాత.. ఇంతకాలం తర్వాత.. విడిపోయిన వాళ్లు కలిసి ఆనం దిస్తున్న ఇవ్వాళా.. ఈయన ఈ మధువు పిడికిటి నుండి దూరం కాకపోవటంలోని వైచిత్రిని ఆమె మనసు అంచనా వేయలేక పోతోంది.

'తాగో, తాగటానికో మీరు ఇక్కడికి రాకండి. ఇది అలాంటి ఇల్లుకాదు, నేను అలాంటి దాన్నీ కాను' అని చెప్పిందే..

ఇవ్వాళ ఇదే ఇంట్లో ఇంతమంది మను షుల మధ్య, కొత్త బంధువైన మీనన్ వొంపి ఇచ్చే మందును తాగుతూ.. సంగీత సాగరంలో ఈదులాడుతున్న ఆ కళాకారుడి మాయలో, తల్లికూడా పడిపో యిన వైనాన్ని అబ్బురంగా చూస్తూండిపో యాడు ప్రకాశం.

అతడికి లోలోన ఒక ఆలోచన రూపుది ద్దుకోసాగింది.

'నాన్న ఇకపై తమతోటే ఉండిపోకూ డదూ? ఆయనెందుకు ఒంటరిగా జీవిం చాలి?' అన్న ఆలోచనే అది. అయితే అది సాధ్యపడటానికి తాను చెయ్యగలిగింది ఇకపై ఏమీ లేదనిపించింది. నిజానికి ఈ పెళ్లి కూడా ఆయన లేకుండానే జరిగుం డేది. మొదట్లో ఆయన గురించి అతడు ఆలోచించను కూడా లేదు. అందుకు తండ్రి, తల్లికి కృతజ్ఞతలు తెలిపినప్పుడు కూడా అతడికి ఏదో తొలుస్తున్నట్టుగా అని పించింది. ఒకనెల రోజులుగా ఆయనను అప్పుడప్పుడు వెళ్లి కలిసినప్పుడు కలిగిన అనుభవాలూ, ఈ పెళ్లికి ఆయన రావటం వల్ల తనకు కలిగిన సంతృప్తీ, గౌరవమూ ఆయన ఇక్కడే ఉండిపోవాలన్న కాంక్ష కలగడానికి కారణాలుగా ఉన్నాయని అతడు గ్రహించాడు.

'అయితే అందుకు ఆయన ఒప్పుకో వాలిగా?' గతంలో ఆయన పట్ల తల్లి ఎంతో కఠినంగా ప్రవర్తించినా, తానువెళ్లి పిలవగానే ఆయన రాలేదా? అదే విధంగా తాను మొండికేస్తే ఆయన కచ్చితంగా ఒప్పుకుంటారు.. అయితే తల్లి నుండి అందుకు పూర్తి అనుమతి తీసుకునే ఆయన దగ్గర ఈ విషయాన్ని ప్రస్తావిం చాలి" అని ఆలోచిస్తూ తండ్రి సంగీతాన్ని ఆస్వాదిస్తున్న సమూహాన్ని, అందులో ఒంటరిగా కూర్చుని ఉన్న అళగమ్మాళ్‌ను చూశాడు ప్రకాశం. ఆమె మూసుకున్న కళ్లతో ఉదయచంద్రిక రాగంలో లీనమై కనిపించింది.

మొదటిసారి ఆయనను కలవడానికి వెళ్లిన రోజు 'క్యాసెట్' నుండి పుష్పా గొంతు నుండి ప్రవహించిన 'మాకేలరా..' కీర్తనను అయన వాయించడాన్ని గుర్తిం చిన ఆనందంలో, తన పక్కన ఉన్న నళి నిని భుజంతో నెట్టి 'ఏ రాగం?' అని ప్రశ్నించాడు ప్రకాశం.

అతడు ఆశ్చర్యపోయేలా ఆ రాగం పేరునూ, పల్లవినీ సన్నటి కంఠంతో పాడింది నళిని.

"నువ్వు పాడుతావా? యు నో మ్యూజిక్?"

"పాడగలను.. కచేరీ చేసే స్థాయికి నేర్చుకోలేదు.. ఇక మీదటే నేర్చుకోవాలను కుంటున్నా.. మీ నాన్నగారి దగ్గర" అని అతడికి మాత్రమే వినబడేలా పెదాల చివర చెయ్యి అడ్డుపెట్టుకుని చెప్పి నవ్వింది నళిని. ప్రకాశం కూడా ఆమెతో శ్రుతి కలిపాడు. అప్పుడే అతనికి ఒక విషయం అర్థమైంది.

తండ్రి ఇకపై ఇక్కడే తమతో ఉండబో తున్నారని వీళ్లంతా అనుకుంటున్నారని. ఈ వివాహం ద్వారా తమమధ్య ఉన్న విభేదాలు సమసిపోయాయని వీళ్లు నమ్ము తున్నట్టుంది. ఈ విషయంలో తనకు

మాత్రమే ఎందుకీ అపోహ? అని ఆలోచించాడు ప్రకాశం. అతడి కళ్లెదుట వయొలిన్ మీద గడ్డాన్ని అదిమి పెట్టి, మూసిన కళ్లతో, ఎప్పటికీ ఒక నూతన రాగంలా, సంగీతాన్ని ప్రవహింపజేస్తున్న తండ్రినీ, ఆయనలాగానే సంగీతంలో మునిగిపోయిన తన తల్లినీ మార్చి మార్చి చూశాడు. మరోపక్క తల నెరిసిపోయినా నూతన దంపతుల్లా ఉత్సాహంగా భుజం భుజం రాసుకుంటూ, పదేపదే ఒకరినొకరు చూసుకుంటూ కళ్లతోటే నవ్వుకుంటున్న మీనన్ దంపతులనూ చూశాడు. వాళ్ల ఐదేళ్ల చివరి కొడుకు తమ మధ్య కూర్చుని

## కొత్తగాలి...

**(అ) రాజకీయులకి**
**హితబోధ చేయడం!**
**ఇంగిత జ్ఞానం లేనివాడికి**
**సంగీతజ్ఞానం నేర్పడం!!**

– పెన్మెత్స సూరిబాబు,
హైదరాబాద్

ఉన్నాడన్న ఆలోచన రాగానే, పక్కకు తిరిగి ఆ పసివాణ్ణి చూశాడు. ఇంకా తన తల్లిదండ్రుల వయస్సే ఉన్న ఎంతోమంది దంపతులను చూసి, వాళ్లతో వీళ్లను బేరీజు వేసి చూసుకోసాగాడు ప్రకాశం.

'అమ్మానాన్నలు ఒకటైతే ఎంతో సంతోషంగా ఉంటుంది. అయితే అది వాళ్లుగా నిర్ణయం తీసుకోవలసిన విషయమైపోయిందిగా' అని మనసులో అనుకున్నాడు.

కచేరీ, విందూ.. అన్నీ ముగిసి పెళ్లికొచ్చిన బంధువులు వెళ్లిపోయేసరికి రాత్రి పదకొండు గంటలైంది. మిగలింది ఇక మీనన్ కుటుంబీకులు మాత్రమే!

రామదురై, మీనన్, పిల్లలూ హాల్లో కూర్చున్నారు. రామదురై, మీనన్ తాంబూలం సేవిస్తుండగా అళగమ్మాళ్‌తోనూ, రామదురైతోనూ మీనన్ ఇలా అన్నాడు, "రేపు అల్లుణ్ణీ, కూతురినీ ఒకవారం హనీమూన్‌కు మా ఊరివైపుకు తీసుకెళదామనుకుంటున్నాం. తిరిగొచ్చాక ఒక వారాని కల్లా నేనూ విదేశాలకు వెళ్లాల్సి ఉంది. ఇక్కడికి వచ్చినప్పుడల్లా కుటుంబంతో సహా ఒకసారి మా పుట్టిన ఊరికి వెళ్లిరావటం అలవాటు. ఈసారి ఒక 'హనీమూన్' జంటతో వెళ్లే అదృష్టం మాకు దక్కింది" అంటూ తన భార్యనూ ఆటపట్టించేలా చెప్పారు. అంటే ఇంతకాలం దూరమై, ఈ పెళ్లిలో కలుసుకున్న అళగమ్మాళ్‌నూ, రామదురైనూ ఒంటరిగా వదిలి వెళ్లాలన్న ఒక ఆలోచన కూడా ఆయన మాటల్లో దాగి ఉండటాన్ని ప్రకాశం గుర్తించాడు.

మరుసటిరోజు సాయంకాలం రెండుకార్లను ఏర్పాటు చేసుకుని పిల్లలూ, భార్యా నూతన దంపతులతో సహా మీనన్ కుటుంబం కేరళకు బయలుదేరారు.

అళగమ్మాళ్ రామదురైలిద్దరూ ఆ రెండు కార్లూ బయలుదేరి వెళ్లేంతవరకూ గుమ్మంవద్దే నిలబడి చేతులూపుతూ నిలబడ్డవాళ్లు, ఉన్నట్టుండి ఇద్దరూ ఒక గదిలో బంధింపబడ్డట్టు ఒకరినొకరు చూసుకున్నారు. అంతవరకూ లేని ఒక బిడియంతో కూడిన సిగ్గుకు లోనయ్యారు. ఇద్దరూ ఒక్కమాట కూడా మాట్లాడుకోలేని మౌనంతో, ఉన్నట్టుండి కలుసుకున్న ఇద్దరు పరాయి వ్యక్తుల్లా ఒకరినొకరు చూసుకున్నారు.

కాసేపటి క్రితం కేరళకు బయలుదేరే ముందు తల్లినీ, తండ్రినీ పక్కపక్కన నిలబెట్టి కొత్త పెళ్లికూతురితో సహా నమస్కరించిన కొడుకును కౌగలించుకున్న అళగమ్మాళ్ చెవిలో ప్రకాశం "అమ్మా..

నాన్నను చూసుకోండి.." అన్నప్పుడు, అతడికి తల్లి పదే పదే చెప్పే 'బి ఎ గుడ్ సన్' అన్న మాటలు గుర్తుకొచ్చి, 'యు ఆర్ ఎ గుడ్ మదర్' అని తల్లి చేతుల్ని పట్టుకుని నసగడమూ ఆమె గుర్తు చేసుకుంది.

అదిగో వీధి చివరిలో కారు మలుపు తిరుగుతుండగా.. కొడుకు ఎడబాటు కొత్తగా అనిపించింది. సంతోషమూ, బాధా కలగలిసిన స్పందనతో కనులు చెమ్మగిల్లాయి. కళ్లు తుడుచుకుంటూ లోపలికివెళ్లి దేవుడి ఫొటోముందు మోకరిల్లి నమస్కరించి లేస్తుండగా హాల్లోకి వచ్చి నిలబడ్డాడు రామదురై.

ఆ హాలుకు ఎదురుగా ఉన్న ప్రకాశం గదిలోనే ఆయన రెండురోజులుగా ఉంటున్నారు. ఒకప్పుడు అళగమ్మాళ్- రామదురై దంపతుల ఏకాంత మందిరంగా ఉన్నది ఆ గదేనని అప్పుడే స్ఫురణకు వచ్చింది ఆయనకు. తాను ప్రకాశం పెళ్లి నిమిత్తం ఇక్కడికి రావటం, అది శుభప్రదంగా ముగిశాక సెలవు తీసుకుని వెళ్లిపోవటమే సరైన పనిగా అనిపించినా, ఏదో బద్ధశత్రువుల్లా, ఒకరినొకరు ముఖం చూసుకోవటానికైనా ఇష్టపడని వాళ్లలా, అందరూ వెళ్లిపోయినంత మాత్రాన తానూ సెలవు తీసుకుని వెళ్లిపోవటం మంచిపని కాదని ఆయనకు తోచింది. ఆ కన్‌ఫ్యూజన్‌లోనే ఏదో ఈ ఇంటికి యజమానిలా- కొడుకును సాగనంపి అళగమ్మాళ్ వెనకే మేడమెట్లెక్కి లోపలికొచ్చి నిలబడ్డారు రామదురై.

ఇప్పుడు ఈ గదిలోని ఏకాంతంలో, గత జ్ఞాపకాలు ఉన్నఫళంగా ముసురుకోవటం ఇబ్బందిగా అనిపించింది ఆయనకు. గదిలో నుండే బయటికి తొంగి చూశారు. అళగమ్మాళ్ వెనుకగదిలో పనిమనిషితో ఏదో మాట్లాడుతూ ఆమెకు ఆజ్ఞలిస్తూ తానూ ఏవో పనులు చేస్తూ కనిపించింది.

రామదురైకు ఆమె గురించిన ఆలోచనలు చుట్టుముట్టాయి. 'ఆమె ఏమనుకుంటోంది? తాను ఇక్కడున్న విషయమే మరిచిపోయిందా? అలా అయితే నేను వెళ్లిపోయాననుకుంటుందా? ఆమెకు చెప్పకుండా నేనెలా వెళ్లగలను? హనీమూన్‌కు వెళ్లిన ప్రకాశం వచ్చేవరకైనా నేను ఇక్కడే ఉండిపోవలసి వస్తుందా? అలా నేను ఉండలేనని ఆమె అనుకుంటోందా? ' ఇలా ఆలోచిస్తూ, తాను ఇప్పుడేం చెయ్యాలో తెలియక గదిలోనే కూర్చుండిపోయారు రామదురై.

ఆయన వయొలిన్ పెట్టే, జత బట్టలున్న సూట్‌కేసూ, గోడపక్కగా కనిపించాయి. ఆ సూట్‌కేసులో మీనన్ ఈయనకిచ్చిన మందు బాటిల్ కూడా ఉంది. ఆ రెండు రోజులుగా మీనన్‌తో ఆయనింట్లో తాగడానికి వీలైంది.

'ఈ ఇంట్లో ఈ గదిలో నేను తాగటం అళగమ్మాళ్ ఇష్టపడదు' ఆ ఒక్క కారణంగానే ఆయనకు అక్కడ నుండి వెంటనే వెళ్లిపోవాలనిపించింది.

'అళగు...' అని ఆ రోజుల్లో ఆమెను పిలిచినట్టు గుర్తు. ఇప్పుడు ఈమెను ఏ పేరుతో పిలవాలన్నది కూడా ఆయనకు సమస్య అయి కూర్చుంది. ఈమె తన భార్య అని పెళ్లికొచ్చిన అందరి ముందూ ప్రవర్తించినట్టు, ఏకాంతంలో ఆయన నడుచుకోలేకపోతున్నాడు. అలాంటి ఒక స్పందన ఆయనలో కలిగినప్పుడల్లా ఆ రంగస్థల నటి పుష్పా ఆలోచనలే.. ఆమెను ఈ మధ్య పోగొట్టుకున్న శోకమే ఆయన మదిలో కదలాడసాగాయి.

పుష్పా జ్ఞాపకాలలో.. ఆమె కంఠమూ, పాటలూ వింటూ మందు తాగడంలోనే శేషజీవితం గడుపుతున్నానని, అదంతా అయిపోయాక, అందులోని సుఖాన్ని కోరుకుంటూ ఇక్కడి నుండి పారిపోవాలన్నంత

ఉద్వేగం కలిగింది ఆయనలో.

అప్పుడు అళగమ్మాళ్ ఆయనకు కాఫీ పట్టుకొచ్చింది. ఆమె కాఫీని అక్కడ పెట్టి, పక్కకెళ్లి నిలబడింది. ఆయన తలవంచుకుని కాఫీని చల్లారుస్తూ ఆలోచనలో పడ్డారు. ఈమె తనను ఇక్కడే ఉండమన్న పక్షంలో, ఈమె మనసు బాధపడని విధంగా ఎలా ఏ కారణంచెప్పి సెలవు తీసుకోవాలా అని ఆయన ఆలోచించసాగారు.

ఆయన సూట్‌కేసూ, దానిమీద తాళం వేసిన వయొలిన్ పెట్టే బయల్దేరటానికి సిద్ధం చేసినట్టు ఆమెకు అనిపించింది. ఎవరో ఒక అతిథిలా ఆయన వచ్చినట్టు.. ఇద్దరిలోనూ ఈ ఏకాంతంలో ఒక పరాయితనం ఒకరి గురించి మరొకరికి ఏర్పడింది.

రామదురై తల పైకెత్తి అళగమ్మాళ్‌ను పరిశీలనగా చూసి చిరునవ్వుతో అన్నారు "అన్నీ ఎంతో బాగా జరిగాయి. నన్ను రమ్మని పిలిచినందుకూ, ఈ పెళ్లిలో కొడుక్కి తండ్రినన్న గౌరవం ఇచ్చినందుకూ కృతజ్ఞతలు. నేను పరాయివాడిగా అయిపోయినప్పటికీ నా కొడుక్కి తండ్రినన్న గౌరవాన్నిచ్చిన నీ గొప్ప మనసుకు ఆ భగవంతుడు నిన్ను ఆశీర్వదించుగాక" అని అంటున్నప్పుడు కృతజ్ఞతా భావం ఎక్కువైపోయి ఆయన కళ్లలో గిర్రున నీళ్లు తిరిగాయి. మాటలు రాక గొంతు కీచుబోయి ముఖాన్ని పైపంచతో తుడుచుకుంటూ సంబాళించుకున్నారు.

తన దృష్టిని మరల్చకుండా ఆయన్నే చూడసాగింది అళగమ్మాళ్.

"ప్రకాశాన్ని వదిలి నువ్వు ఒంటరిగా ఉండడం ఇదేమొదలు కదూ? " అని అడిగారు రామదురై.

"లేదు. వాడు మెడికల్ రెప్రజంటేటివ్‌గా ఉంటున్నప్పుడు అప్పుడప్పుడు బయటి ఊళ్లకు వెళ్లేవాడు. అప్పటినుండే ఇంటిపట్టునే ఉండేటట్టు ఒక పనిమనిషిని ఏర్పాటు చేసుకున్నాను" అంది అళగమ్మాళ్.

మధ్య వయసు కలిగిన ఒక స్త్రీ హాలులో నుండి వెళ్లటం చూశారు రామదురై.

పెద్ద భారాన్ని దించుకున్నట్టు కాస్త ఊరట కలిగింది ఆయనకు. బంధువులు, కొడుకు, అమ్మాయి తరఫువాళ్లు.. అందరూ ఈమెను ఒంటరిదాన్ని చేసి ఊరికెళ్లే పథకాన్ని గురించి - అందుకు వాళ్లు అనుకున్న కారణం వేరు. ఇరవై ఏళ్ల తర్వాత ఒకటైన ఇరువురికీ సౌకర్యంగా ఉంటుందని మీనన్ మందు మైకంలో కన్నుగీటుతూ చెప్పటం ఆయనకు గుర్తుకొస్తోంది.. తాను ఆమెను ఒంటరిగా వదిలి వెళ్లటం సరైనదిగా ఉంటుందా అని ఆలోచిస్తున్న రామదురైకు. ఈమె తను ఉండటాన్ని ఇష్టపడదేమో? అన్న అనుమానం అప్పుడే మొదలైంది.

"ఇంతకాలం తరువాత దొరికిన తండ్రి తనతోటే ఉండిపోవాలనే కోరిక ప్రకాశానికి ఉన్నట్టుంది" అని సన్నటి కంఠంతో అంది అళగమ్మాళ్.

"నేనెక్కడికి వెళతాను? ఇదే ఊళ్లోనేగా ఉంటాను. అప్పుడప్పుడూ వచ్చి చూసి వెళతాను.. ప్రకాశానికి ఈ ఇల్లెలాగో నేనుండే చోటూ అంతే!" అని ఏదో మాట్లాడి ముగించారు రామదురై.

"మీరిప్పుడు ఒంటరిగానే ఉన్నట్టు చెప్పాడు వాడు.." పశ్చాత్తాపంతో అంది అళగమ్మాళ్.

"ఇద్దరికి సంబంధించిన జీవితంలో ఎవరో ఒకరు ఏదో ఒక సమయంలో ఒంటరి కావలసిందేగా? " అన్నారు రామదురై.

ఇద్దరూ కాసేపే మౌనంగా తమతమ

## వినువీధిలో హోటల్!

చైనా రాజధాని షాంఘైలోని 'ది గ్రాండ్ హయ్యట్ షాంఘై' హోటల్ అపురూపమైనది. ప్రపంచంలోని మూడో అతి ఎత్తైన భవన జిన్ మావో టవర్‌లో ఇది ఉంది. 88 అంతస్తుల ఆ టవర్‌లో 53 నుంచి 87వ అంతస్తు దాకా ఉన్న ఈ హోటల్‌లో మొత్తం 555 గదులు ఉన్నాయి. పై అంతస్తుల్లోని ఏ గదిలోంచి చూసినా షాంఘై నగర దృశ్యం అద్భుతంగా కనిపిస్తుంది.



గది బయట వర్తులాకారంలో ఉండే కారిడార్‌లోంచి చూస్తే కింద లాంజ్, అందులోని మనుషులు కనిపిస్తారు. పక్కనే ఉన్న హువాంగ్‌పూ నది కనపడే గదుల అద్దె అన్ని గదులకన్నా అధికం. రివర్ వ్యూ కింగ్‌లుగా పిలిచే ఆ గదులకు రోజుకు పదిహేడు వేల రూపాయల అద్దె చెల్లించాలి. మిగిలిన గదులను వాటి తాహతును బట్టి ఛైర్మన్ సూట్, ప్రెసిడెన్షియల్ సూట్, డిప్లోమేటిక్ సూట్, క్లబ్ కింగ్‌లుగా పిలుస్తారు.

స్విమ్మింగ్ పూల్స్, ఆడిటోరియం, బార్స్, రెస్టారెంట్స్ తదితర సౌకర్యాలు గల హయ్యట్‌లో దేశాధినేతలు, ధనవంతులైన వ్యాపారులు దిగుతుంటారు.

జిన్ మావో టవర్‌లోని కింది యాభై రెండు అంతస్తుల్లో ఆఫీసులు, సూపర్‌బజార్స్, షాపింగ్ మాల్స్ ఉంటాయి. అత్యంత విలాసవంతమైన ఈ హోటల్‌ను యాత్రికులు తప్పనిసరిగా సందర్శిస్తారు.

ఆలోచనల్లో ఉండిపోయారు. రామదురై కాఫీ తాగటం పూర్తి చేశారు.

అళగమ్మాళ్ ఎక్కడో నేలకేసి చూస్తూ మెల్లగా అంది, "మీలాగా మన కొడుకూ ఒక తాగుబోతు కాకూడదు. మీ స్వేచ్ఛ కుటుంబ జీవితానికి సరిపడదని ఎంతో ఎంతో ఆలోచించే మీతో నేను అంత కఠినంగా నడుచుకున్నాను ఒకప్పుడు! మీతో కలిసి జీవిస్తే నా భవిష్యత్తు ఎలా ఉంటుందోనని భయపడ్డాను, ఆ వయసులో! ఇప్పుడు నాకు ఆ భయమో, దిగులో లేదు.."

ఆమె ఇంకేదో చెప్పాలనుకున్న విషయాన్ని పూర్తిగా గ్రహించిన వాడిలా నవ్వి ఇలా అన్నారు రామదురై, "ఇప్పుడు మనం విడిపోయి ఉండటం - భయంవల్లనో, శత్రుత్వంవల్లనో కాదు... మన మన స్వేచ్ఛ కోసమే మనం ఇప్పటివరకూ అలా బతికేశాం. అందులో సంతోషమో, బాధో - లేదు రెండూనో? ఏదైనప్పటికీ దాన్ని స్వేచ్ఛగా అనుభవించేశాం. నా జీవన విధానమూ, పద్ధతీ వేరు. మునుపటిలా మనం ఒకరి ముఖాన్ని సైతం మరొకరు చూడకుండానో, ఇక్కడికి రాకుండానో ఇకపై ఉండబోవటం లేదు.. అందుకు మూలకారణంగా మనలో ఉన్న మనస్పర్ధలన్నీ ఈ పెళ్లి వల్ల దూరమైపోయాయి. ప్రకాశం వచ్చిన వెంటనే నేను మళ్లీ వస్తాను. ఇప్పుడు నేను సెలవు తీసుకుంటాను. అక్కడ నాకంటూ ఒక జీవితమూ, కొందరు మనుషులూ ఎదురుచూస్తుంటారు" అన్నారు.

అళగమ్మాళ్ కాసేపు మౌనంగా ఉండి పోయింది. ఆయన చెప్పే విషయాలు ఆమెకు న్యాయంగానే అనిపించాయి.

'ఒకవేళ నేను ఆయనను బలవంతం చేసి, ఆయన తోడూనీడా వృద్ధాప్యంలోనూ కావాలని తన హక్కును తెలియజేసి, ఇక్కడే ఉండేలా చెయ్యటం సాధ్యమైనప్పటికీ, దాని ఫలితంగా ఏర్పడే ఆ జీవితం ఎలా ఉంటుంది?' అని ఆమె ఆలోచించి చూసింది.

జీవితంలో దేన్నైనా ధైర్యంగా చెయ్యటానికి ముందు, చేసిన తర్వాత ఏర్పడబోయే ఫలితాలెలా ఉంటాయో ముందుగా ఊహించే స్వభావం ఉన్న అళగమ్మాళ్ ఇప్పటివరకూ నిర్ణయాలు తీసుకుంటూ తద్వారా విజయాలనందుకుంటూ, గౌరవంగా, గర్వంగా తలపైకెత్తుకుని ఉండగలుగుతోంది.

**కొత్తగాలి...**

**మంచిని పెంచడం కంటే**
**సంచిని నింపుకోవడంపైనే**
**మక్కువ**
**దేశభక్తి కంటే**
**కోశభక్తే ఎక్కువ**

*– ఏ. సూర్యప్రకాశ్, సికింద్రాబాద్*

అలాంటి ఆలోచనలు కలగని ప్రాయంలో 'ఈ రామదురై బావనే...' అని అమాయకంగా ఇచ్చిన మాటను, బాధ్యతగా ఆమె ఇప్పటివరకూ కాపాడుకుంటూ వస్తోంది.

జీవితంలో ఒక పట్టుదలలా - అదొక భారమైనప్పటికీ ఒక బిడ్డా - వాణ్ణి భద్రంగా కాపాడ్డానికి ఒకింత ఆర్థిక పరిపుష్టి ఉన్న పక్షంలో 'భర్త తోడు' అన్నది ఒక స్త్రీకి అంత ముఖ్యమైన విషయమేం కాదని ఆమె తన అనుభవపూర్వకంగా తెలుసుకున్న ఒక పాఠం.

'ఈయనతో ఏ మనస్పర్థలూ లేకుండా ఒక చక్కటి అనుబంధంతో, గౌరవంగా విడిపోయి బతికే బతుకునే ఆమె మనసూ అంగీకరిస్తోంది. అయినప్పటికీ ఇన్నేళ్ళ తర్వాత తనను గౌరవించటానికీ, తనతో అనుబంధాన్ని కొనసాగించటానికీ ఆయన తిరిగొచ్చే పక్షంలో ఎలాంటి పట్టింపులూ లేకుండా, తన ఒంటరి జీవితానికి ముగింపు పలికే ఉద్దేశంతో, తనకున్న హక్కుతో ఆయన ఇక్కడే ఉండిపోతే? ఆ పరిస్థితిని ఇష్టపడి అంగీకరించటమా? విరక్తితో దూరంచేసుకోవటమా?' ఇలా గంతా అళగమ్మాళ్ లోలోన తికమకపడ సాగింది.

ఈ పరిస్థితిలో ఆయనా తనలాగానే ఆలోచిస్తున్నారని తెలియగానే ఒక మర్యాద కోసం 'మీరు మాతో కలిసి ఉండటంలోనే మాకు ఆనందం' అని చెప్పాలని ఆమెకు ఒకపక్క ఉన్నా అందుకు అంగీకరించిన జీవితం ఎలా ఉంటుందోనని మరోపక్క ఒక ఆలోచనా కలగసాగింది. ఆ ఆలోచన తర్వాత ఆయనతో పైవిధంగా తాను అంటే అదొక 'నీచ మర్యాద' అవుతుందని గ్రహించింది.

'ఈయన ఆ పుష్పా ఆలోచనలతో, ఆమె పాటలను వింటూ, వయొలిన్ వాయిస్తూ, సదా మందు పుచ్చుకుంటూ, ఈ ఇంట్లో ఒక ఒంటరి గదిలో కూర్చుంటారేమో'- అది ఆయన స్వేచ్ఛ.

దాన్ని ఖండించడానికో, మార్చటానికో ఎవరికీ హక్కు లేదు..

ఆ విషయాన్నే ఆయన చెబుతున్నారు.

'మన జీవన విధానాలు, పద్ధతులూ వేరు వేరుగా ఉన్నాయి' అంటూ..

ఆలోచించి చూస్తే - ఎంత వేర్వేరు పద్ధ

తులుగా ఉన్నప్పటికీ, విడిపోయి జీవిస్తున్నా తనకూ తన భర్తకూ మధ్య గుణగణాలలో ఒక ఐక్యత ఉండటాన్ని గుర్తించి ఆమె ఎంతో పొంగిపోయింది.

ఆత్మాభిమానంతో దూరమైపోయిన ఇరువురు ఏకం కావటానికి ఎన్నో సందర్భాలలో గౌరవాభిమానాలూ, ఒంటరి వ్యక్తి యొక్క కొన్ని ప్రత్యేక గుణాలూ అడ్డుగా నిలుస్తాయి. అదే విధంగా అభిమానవంతులు విడిపోవటానికి అవే తోడుగా ఉంటాయని అళగమ్మాళ్‌కు అనిపించింది.

ఆమెకు అనుగుణంగా ఒక జీవితాన్ని ఆమెతో కలిసి జీవించడం.. కాలక్రమంలో అది ఇరువురికీ మనసు భరించలేనంతగా మారిపోతుందని- వయసు మీదపడి, తలలు నెరిసిన ఆ ఇద్దరి బుద్ధీ క్షుణ్ణంగా గ్రహించటం వల్ల, వాళ్లిద్దరూ సంతోషంగా.. దూరంగా ఉండి బతికున్న ఈ జీవితంలో అనుబంధాన్నే మళ్లీ ఒకసారి అంగీకరించారు.

'ఔను! ఈయనను తప్పు పడుతూ, ఈయనతో కలిసి జీవించడంకన్నా, విడిపోయి బతుకుతూ ఎప్పుడైనా ఇక్కడికొచ్చే ఈయన రాకకోసం ఎదురుచూసే ఒక స్త్రీగా జీవించడమే ఉత్తమం'

"సరే.. మీ ఇష్ట ప్రకారమే కానివ్వండి.. కానీ ఏదో ఒకరోజు, ఇంకాస్త వయస్సు పైబడ్డాక దేవుడి దయవల్ల మనం కలిసి బతికేరోజు రావచ్చు. అప్పుడు నేను మిమ్మల్ని వెతుక్కుంటూ మీరున్న చోటికి వస్తాను.. రావచ్చా? " అని అడిగింది.

రామదురై కళ్లల్లో నీళ్లు తిరిగాయి.

"తప్పకుండా! ఆ రోజు కోసం ఎదురు చూస్తుంటాను" అన్నారు.

రాత్రి ఏడు గంటలకు పనిమనిషి, మెయిన్‌రోడ్డు మీదికెళ్లి ఒక టాక్సీని మాట్లాడుకొచ్చింది, రామదురై కోసం.

రామదురై సూట్‌కేసూ, వయొలిన్ పెట్టే తీసుకెళ్లి టాక్సీలో పెట్టమంది అళగమ్మాళ్. వయొలిన్ పెట్టెను మాత్రం తానే తీసుకున్నారు రామదురై.

ఇద్దరూ మేడమెట్లు దిగి వచ్చి గేటుకు బయట వీధిలోని టాక్సీ వద్ద నిలబడ్డారు.

"అయితే.. మరిక నేను వెళ్లొస్తాను.." అని సెలవు తీసుకున్న భర్తకు చేతులు జోడించి నమస్కరించింది అళగమ్మాళ్.

"వెళ్లిరండి సామీ" నమస్కరించిన పని మనిషికీ కలిపి నమస్కరించారు రామదురై.

"కోడంబాక్కం చూళైమేడుకు వెళ్లాలి" టాక్సీ డ్రైవరుతో చెప్పాక టాక్సీ కదిలింది. ఆ వీధిలోంచి మెయిన్ రోడ్డు మీదికి టాక్సీ మలుపు తిరిగేంతవరకూ వీధి గుమ్మం వద్దే నిలబడింది అళగమ్మాళ్.

పనిమనిషి లోపలికి వెళ్లి తన పనిలో మునిగిపోయింది. అళగమ్మాళ్ మేడమెట్లెక్కి వస్తూ ఒక మలుపులో నిలబడి ఆ వీధికున్న ఒక కోణాన్ని చూస్తూ నిలబడింది. కాసేపయ్యాక మరొక పక్కకొచ్చి ఇంకో కోణంలో కనిపిస్తున్న మెయిన్‌రోడ్డును చూస్తూ.. చాలా సేపటి వరకూ అలాగే చూస్తూ నిల్చుంది.

ఆ సాయంకాలం.. బయటి ఊరికి వెళ్లిన కొడుకూ, కోడలూ తిరిగి రావటానికి ఇంకా ఒక వారం రోజులు పట్టొచ్చు. ఇప్పుడే రామదురై సెలవు తీసుకుని వెళ్లారు. ఆమె ఎవరి కోసం.. దేన్ని ఆశించి.. ఎదురుచూస్తోంది?

ఎవరినో ఎదురుచూస్తూ, ఎవరి రాక కోసమో కాచుకుని ఉండేదానిలా అక్కడే ఒక బొమ్మలా నిలబడి ఉంది అళగమ్మాళ్. ఏదో ఒకరోజు అంటూ వస్తుందటగా! రామదురై ఆమె కలిసి జీవించే.. ఆరోజు కోసం ఎదురు చూస్తూ కాచుకొని నిలుచుందా? Ⓒ



# హా హ్హ.. అమెరికా 9

# ఎగతాళి.. వెక్కిరింపూ..

**ఇటీవల చెన్నైలోని అమెరికా కాన్సులేట్‌కి చెందిన డిప్లొమేట్ మౌరీన్ చావో ఢిల్లీ నుంచి ఒరిస్సాకి ఇరవై నాలుగు గంటల రైలుట్రిప్ ప్లాన్ చేసుకున్నారు. కానీ ఆ బండి డెబ్బైరెండు గంటలైనా గమ్యం చేరుకోలేదు. 'దాంతో నా శరీరం అంతా నల్లగా అపరిశుభ్రంగా మారిపోయింది. తమిళుల లాగా' అని చెన్నైలోని ఎస్సారెమ్ యూనివర్సిటీలో ఓ ప్రసంగంలో ఆమె పేర్కొంది. తమని అవమానించిందని తమిళులు గొడవ చేసారు. మౌరీన్ వ్యాఖ్యలపై అమెరికా రాయబార కార్యాలయం వివరణ ఇవ్వాల్సి వచ్చింది. ఇలా ఇతర దేశస్థుల్ని ఎగతాళి చేయడం అమెరికన్ల స్వభావమని చాలామంది చెబుతుంటారు.**

అమెరికా జాత్యహంకారానికి పైన పేర్కొన్న సంఘటన ఒక ఉదాహరణ అంతే. అమెరికన్లు అనేక దేశాలమీద జోకులు సృష్టించారు. ఇవన్నీ ఆయా దేశాల ప్రజల ప్రవర్తనా రీతులను విమర్శించడానికే పుట్టాయి. తాము ప్రపంచంలోని అందరికన్నా అధికమనే మౌఢ్యం అమెరికన్లలో కన్పిస్తోంది. అక్కడి లేట్‌నైట్ టీవీ షోలలో ఇలాంటి జోకులు ప్రసారమవుతుంటాయి.

అమెరికాలో ప్రతీది అమ్మకపు సరుకు కావడంతో ప్రత్యేకంగా కమెడియన్లు కుళ్ళు జోకులను తయారు చేస్తుంటారు. అక్కడికి వివిధ దేశాల ప్రజలు వలస వెళ్ళడంతో అందరి తీరుతెన్నులూ వారికి పరిచయం. దాంతో ఇలాంటి జోకులను విరివిగా తయారు చేస్తుంటారు. దేవుడు, మతంతోపాటు అన్నిటినీ వారు అపహాస్యం చేశారు.

గతంలో అమెరికన్లు తమ ప్రధాన శత్రువు రష్యాపై 'కమ్యూనిస్ట్ జోక్స్' సృష్టించారు. అవి-

★ 'స్టాలిన్ బొమ్మను తపాలా బిళ్ళపైన ఎందుకు ముద్రించరు?'

- ప్రజలు జిగురు ఉన్నవైపు కాక రెండో వైపు ఉమ్ముతారని.

★ రష్యన్లు నకిలీ డాలర్లను ముద్రించి అమెరికాలోని ఏజెంట్లకు పంపారు. అయితే ఏంటి?

- అందులోని భాష కూడా రష్యన్.

★ మాస్కోలో ఒకచోట క్యూ చూసి అక్కడ బంగాళదుంపలో, బ్రెడ్డో దొరుకుతాయని ఓ రష్యన్ నిలబడ్డాడు. కాస్సేపటికి క్యూలోంచి కొందరు బయటికి రావడం గమనించి, 'మీరు ఏం కొనదల్చుకోలేదా?' అన్నాడు.

- 'ఇక్కడ ఏం అమ్మడంలేదు. కృశ్చేవ్ సమాధి మీద ఉమ్మేయడానికి క్యూ. నావంతు రావడానికి మూడు రోజులు పట్టేలా ఉంది' అనేది జవాబు.

దాదాపు సర్దార్జీ జోకుల్లాగానే పోలెండ్‌వారిని మూర్ఖులుగా చిత్రిస్తూ అమెరికన్లు చాలా జోక్స్ పుట్టించారు. అందులో ఇది బాగా ప్రచారమైంది.

★ పోలిష్ హెలికాప్టర్ ఎందుకు కూలింది?

- దాని పైలెట్‌కి చలేయడంతో పైన తిరిగే ఫేన్ ఆపేసాడు.

★ ఓ మహిళ హేండ్‌బేగ్‌ను దొంగ ఎత్తుకెళ్తే, పోలీసులు అనుమానితుల్ని ఓ చోట నిలబెట్టారు. వారిలో దొంగని గుర్తించమని ఆమెను కోరారు. అప్పుడేం జరిగింది?

- వెంటనే వారిలో ఒకడు ఓ అడుగు ముందుకేసి, 'ఆమె బేగ్ దొంగిలించింది నేనే' అని అరిచాడు. తీరా చూస్తే అతడో పోలిష్.

★ కారు తాళం చెవిలోపలే ఉంచి, డ్రైవింగ్ సీట్ తలుపు లాక్‌చేసిన పోలిష్‌మన్ గురించి తెలుసా?

- తెలుసు కోట్‌హేంగర్‌తో తలుపు తెరిచి లోపల చిక్కుకున్న తన కుటుంబ సభ్యులను

బయటకి తీసాడు.

ఇలాగే స్కాటిష్ ప్రజలు తాగుబోతులని, ఐరిష్‌వాళ్ళు పిసినారులని, కెనెడియన్లు హోమోసెక్సువల్స్ అని, ఫ్రెంచివాళ్లు పిరికివాళ్లని అనేక జోకులను అమెరికావాళ్లు సృష్టించారు.

★ ఇద్దరు ఐరిష్‌వాళ్ళు సముద్రం ఒడ్డున నడుస్తూంటే వారికో ఖాళీ పాతసీసా దొరికింది. దాని బిరడా తీసి చూస్తే అందులోంచి ఓ భూతం బయటికొచ్చి ఏం కావాలని అడిగింది?

- వెంటనే మొదటివాడు సముద్రమంతా బీర్‌గా మారిపోవాలని అన్నాడు. రెండోవాడు తక్షణం 'మనం రాజుగారి దగ్గరకి వెళ్ళి ఈ విషయం చెప్పాలి' అన్నాడు. రాజు అది విని, ఇక నుంచి నావికులు బోట్లోనే మూత్రం పోయాలనే నియమాన్ని పెట్టాడు.

★ ఓ ఐరిష్ న్యూయార్క్‌లో విమానం దిగి వైన్‌సీసా బిరడాలతో బయటికి వచ్చాడు. కస్టమ్స్ వాళ్ళు 'నీ సామానేది?' అన్నారు?

- 'దారిలో సామానంతా తాగేసాను' అన్నాడు.

మార్టిన్ లూథర్ కింగ్ నల్లవారి హక్కుల కోసం పోరాడినప్పటికీ నల్లవారిపైన ఇంకనూ అమెరికన్లు కుళ్లు జోకులు వేస్తూనే ఉన్నారు.

★ చెట్టు మీంచి నల్లవాడ్ని ఎలా దింపాలి?

- అతని మెడ చుట్టూ ఉన్న తాడుని కోసి.

★ ఓ నల్ల పిల్లవాడికి దేవుడు రెండు రెక్కలు ప్రసాదించాడు. దాంతో, 'లార్డ్ నేనిప్పుడు దేవతనా?' అని ఆ పిల్లవాడు అడిగాడు.

- 'కాదు, గబ్బిలానివి' అని దేవుడు చెప్పాడు.

పొరుగు దేశమైన మెక్సికన్ల పేదరికం పైన కూడా అమెరికన్లు జోకులు వేస్తుంటారు.

★ ఓ పేద మెక్సికన్, ధనిక మెక్సికన్, శాంతాక్లాజ్ ఓ త్రికోణపు గదిలో తలా ఒక మూలనుంటారు. గది మధ్యలో ఓ డాలర్ నోట్ వేస్తే దాన్ని ముందెవరు తీసుకుంటారు?

- పేద మెక్సికన్. ఎందుకంటే మిగిలిన ఇద్దరూ ఈ ప్రపంచంలో నిజానికి ఉండరు.

★ ఓ పిజ్జాకి, మెక్సికన్‌కి గల తేడా ఏమిటి?

- పిజ్జా ఓ కుటుంబం ఆకలిని తీర్చగలదు.

★ రెండుకార్లు మెక్సికో సిటీలో గుద్దుకున్నప్పుడు ఏం జరిగింది?

- నలభై మంది మెక్సికన్లు మరణించారు.

తాము బ్రిటిష్ ఆచారాలను పాటిస్తున్నప్పటికీ వారంటే అమెరికన్లకు పడదు.

★ హాలీవుడ్ సినిమా చూసినప్పుడు బ్రిటిషర్స్ ఎప్పుడు నవ్వుతారు?




- అమెరికన్లు నవ్వినప్పుడు.

★ మాంచెస్టర్‌లోని ఓ వేలంశాలలో ధనిక అమెరికన్ పదివేల పౌండ్ల పర్స్ పోగొట్టుకున్నాడు. అది దొరికిన వారికి వంద పౌండ్లు బహుమతిగా ఇస్తానని ఆయన ప్రకటించాడు.

- అదివిని ఓ బ్రిటిషర్ వెంటనే వందాయాభై అని గట్టిగా అరిచాడు.

ఫ్రెంచ్‌వాళ్లంటే అమెరికన్లకు రెండో ప్రపంచ యుద్ధకాలం నుంచి ద్వేషం.

★ ఫ్రెంచి ఆర్మీ మోట్టో ఏమిటి?

- స్టాప్, డ్రాప్ అండ్ రన్

★ తన దేశాన్ని రక్షించడానికై మరణించిన ఫ్రెంచ్‌వాడి పేరేమిటి?

- ఎవరికీ తెలీదు. ఎందుకంటే ఇంత వరకూ అలాంటి సంఘటన జరగలేదు.

అమెరికన్ల ఎగతాళుల్ని మిగతావాళ్లు పట్టించుకోకపోవడంతో విదేశీసంబంధాలు దెబ్బతినట్లేదు. కాని నిజానికి అమెరికన్ అంటే బ్రెజిలియన్ కాఫీని, చైనా కప్పులో తాగుతూ, ఫ్రెంచి పేస్ట్రీని తింటూ, డేనిష్ కుర్చీలో కూర్చుని, జపనీస్ పెన్‌తో, కెనడా నోట్‌బుక్‌లో, సాయంత్రం ఇటాలియన్ సినిమాకి వెళ్లాలని, ఇంగ్లీష్ భాషలో రాసుకునేవాడని చెబుతుంటారు. ప్రపంచంలో మరేదేశం ఆధారపడనంతగా తమ అవసరాల కోసం విదేశాల మీద అమెరికా ఆధారపడుతోంది అన్నది జగమెరిగిన సత్యం.

– డి. పద్మజ

గతనెల పజిల్ పూరించి, అన్నీ సరైన సమాధానాలు రాసినవారిలో డ్రా ద్వారా ఎంపికైన విజేత

**నందూరి నాగేశ్వరరావు**

301, పినాకిల్ ప్యాలెస్,
ఉమానగర్ వీధి నెం.1,
బేగంపేట, హైదరాబాద్
పిన్ : 500016

వీరికి రూ. 150/- త్వరలోనే అందుతాయి.

# చతురంగం - 8 జవాబులు

| 1 కి | ష్కిం | 2 ధ | | 3 త్రీ | | 4 రో | 5 ష | 6 నా | 7 ర |
|---|---|---|---|---|---|---|---|---|---|
| టి | | 8 ర | 9 ణ | రం | 10 గం | | 11 కీ | ర | వా |
| 12 కి | 13 రా | | వీ | | 14 ధ | నం | | డు | |
| | 15 రా | త్రి | | 16 శో | కం | | 17 రు | డు | 18 గు |
| 19 రో | జు | | 20 రా | ధ | | 21 వీ | రూ | | ణ |
| క | | 22 స | య | న | 23 తా | ర | | 24 జీ | వం |
| 25 లి | 26 పి | | లు | | 27 ప | తా | కం | | తు |
| | 28 క | ధ | | 29 దా | సు | డు | | 30 దం | డు |
| 31 తా | ర | | 32 నా | మా | లు | | 33 మే | డ | |
| | 34 వం | ద | | షా | | 35 గుం | ట | స | క్క |

## సరైన సమాధానాలు రాసిన వారు

1. ఉమాబాల చుండూరు, హైదరాబాద్, 2. వి.వి. సత్యనారాయణ శెట్టి, తిరుపతి, 3. తాజీ ప్రసాద్, టి. నగర్, చెన్నై, 4. ఎం. సబిత, తణుకు, 5. మేదూరి సత్యనారాయణ, తిరువూరు, కృష్ణాజిల్లా, 6. యు. విజయ శేఖర రెడ్డి, కూకట్‌పల్లి, 7. పి.బి. సీతాదేవి, నరసాపురం, ప.గో. జిల్లా, 8. గరిమెళ్ల సత్య, అలకాపురి, హైదరాబాద్, 9. కోనే నాగవెంకట ఆంజనేయులు, విశాఖ స్టీల్‌ప్లాంట్, 10. డా. జి. విమలారంగారావు, చెన్నై, 11. కె. స్వరలయ, ఉడ్‌నగర్, చీరాల, 12. పి. సత్యవతి, గచ్చిబౌలి 13. దేసూళ నిర్మలాదేవి, ఎర్రగడ్డ, హైదరాబాద్, 14. యు. చిట్టిబాబు, న్యూ పాల్వంచ, ఖమ్మం జిల్లా, 15. జె.వి.వి. సత్యనారాయణమూర్తి, బీజాపూరు, 16. టి. శశికళ, గుంతకల్లు, 17. యు. యు. యు, ఎమ్మిగనూరు, 18. బందా శ్రీనివాసరావు, చందానగర్, హైదరాబాద్, 19. ఎన్. రమణారెడ్డి, శింగరకొండ పాలెం, ప్రకాశం జిల్లా 20. జి. సూర్యనారాయణ, బందలాయిచెరువు, కృష్ణా జిల్లా, 21. పచ్చిగోళ్ల కుసుమకుమారి, రాయకుదురు, ప.గో.జిల్లా, 22. ఎస్. మనోరమ, చిక్కడపల్లి, హైదరాబాద్, 23. వాణి నేమాని, విశాఖపట్నం, 24. వరహాభట్ల అన్నపూర్ణ, సికింద్రాబాద్, 25. నేమాన సుభాష్‌చంద్ర బోస్, ఇలిసిపురం, శ్రీకాకుళం, 26. టి.వి.డి.ఎస్. సీతారామారావు, సూర్యారావుపేట, విజయవాడ, 27. ఆర్. నాగేశ్వరరావు, శ్రీకాకుళం, 28. విజయకృష్ణ, ఎ.ఎస్. రావు నగర్, హైదరాబాద్, 29. కోట లలిత, సికింద్రాబాద్, 30. అవ్వారి సామ్రాజ్యలక్ష్మి, మోతీనగర్, హైదరాబాద్, 31. కాకర్లమూడి కృష్ణప్రసాద్, తణుకు, 32. చుండూరు అప్పల నరసింహం, బాచుపల్లి, 33. ఎం. అరుణరేఖ, బెంగళూరు, 34. మాడుగుల జానకి, విజయవాడ, 35. ఎస్. పద్మావతి, విజయవాడ, 36. వానపల్లి వెంకట సత్య గంగరాజు, విశాఖ, 37. పొనుగోటి నరసింహారావు, దుబ్బాక, నల్గొండ జిల్లా, 38. బి.ఎస్. రంగ, తాడేపల్లిగూడెం, 39. గేదెల రామారావు, ఏలూరు, 40. ఎం. రామచంద్రరావు, హిల్‌కాలనీ, నల్గొండ జిల్లా, 41. చాట్ల గంగమణి, కామారెడ్డి, 42. ఎం. నాగలక్ష్మి, కర్నూలు, 43. ఎ. దినేష్‌బాబు, తిరుపతి, 44. యోగేశ్, ప్రశాంత్‌నగర్, హైదరాబాద్, 45. బిక్కనూరి రాజేశ్వర్, ఈదిగాం, ఆదిలాబాద్ జిల్లా 46. లోచర్ల ఉమామహేశ్వరరావు, చిట్టివలస, విశాఖ జిల్లా, 47. జి.యస్.యస్.జి.ఎల్. ఆచార్యులు, పరవాడ, విశాఖజిల్లా 48. వి. సీతానరసింహారావు, కరెన్సీనగర్, విజయవాడ, 49. ఎం. సత్యనారాయణ శర్మ, జూబిలీహిల్స్, 50. ఎ. సుబ్బారావు, బ్రాడీపేట, గుంటూరు, 51. టి. హేమలత, మచిలీపట్నం, 52. టి.ఆర్. బాలకృష్ణారావు, రాజమండ్రి, 53. పి. దేవసేన, సిద్ధార్థనగర్, హైదరాబాద్, 54. కె.ఎస్. ఆచార్యులు, విజయనగరం, 55. వి.వి. నరసింహారావు, కేతినేనివారి వీధి, విజయవాడ, 56. కె. వాణీ సుజాత, బ్రాడీపేట, గుంటూరు, 57. ఎం.వి.ఎస్. శాస్త్రి, హైదరాబాద్, 58. కాట్రగడ్డ భాస్కరరావు, సికింద్రాబాద్, 59. డి. భాగ్యశ్రీ, నిజామాబాద్, 60. గురజాల వరలక్ష్మి, ఉప్పలి, తూ.గో.జిల్లా, 61. బి.వి. పద్మావతి, కొత్తగూడెం, 62. కె.వి. ఆర్. హనుమంతరావు, మంగాపురం, హైదరాబాద్, 63. సాధనాల నాగవర్ధని, నూజివీడు, కృష్ణా జిల్లా, 64. డి. వసుంధరాదేవి, కరీంనగర్, 65. సి.జి.ఎస్. రావు, హైదరాబాద్, 66. కూనపరెడ్డి సత్యనారాయణ, ఆమందూరు, చిత్తూరు జిల్లా, 67. ఎ. శివాజీకుమార్ రెడ్డి, యర్రగుంట్ల, కడప జిల్లా, 68. ఇ. ఎల్. నరసింహారావు, మధిర, ఖమ్మం జిల్లా, 69. బిరుదు విక్రమ్ జ్యోతి, చీరాల, ప్రకాశం జిల్లా, 70. జె. వసంత, ట్రూప్‌బజార్, హైదరాబాద్, 71. శ్రీపెరంబుదూరు నారాయణరావు, హైదరాబాద్

# చతురంగం - 9 ఆధారాలు

**అడ్డం**

1. 'మనుచరిత్ర' రాసిన కవి (3)
4. నవనవలా వేదిక, 'విపుల' జంటపత్రిక (3)
7. 'మహాప్రస్థానం' కర్త (2)
8. గందరగోళమైన శ్రీమహావిష్ణువు వాహనం (4)
9. గుర్తు, స్వభావం (4)
10. సాదా జంట పదం అటునుంచి (2)
12. 'ఎంత వారలైనా...' అని త్యాగరాజ స్వామి అన్నారు (5)
16. పాలగుమ్మి పద్మరాజుగారి అంతర్జాతీయ స్థాయి కథ (4)
18. పండితులు, మంచి మనస్సు కలవారు, పువ్వులు.. గజిబిజి (5)
20. ఆకాశం, వస్త్రం.. కానీ అటునుంచి (3)
21. ఈ బలుడు కౌరవుల మేనమామ, శకుని మామ (4)
22. 'ముందర కాళ్లకు...' అంటారు, పశువులు ఎటూ పోకుండా కాళ్లకు వేస్తారు (2)
24. పాముకు విషం దీంట్లో ఉంటుంది (2)
25. పొంగు కాదు, వర్ణం (2)
27. భజన చేసేవాడు కాదు, చీల్చి చెండాడే వాడు.. కానీ గజిబిజి అయ్యాడు (4)
30. ఆడపిల్లలు ఓణీతో పాటు కట్టుకునేది (3)
32. వట్టిది.. ఉత్తిది (2)
34. అటు నుంచి దేవాలయం (3)
35. 'పాండవులు.. పాండవులు తుమ్మెదా..' అంటూ షావుకారు జానకి పాడిన సినిమా (5)

**నిలువు**

1. పాలను తోడుపెడితే (3)
2. పాములకు శత్రువు.. కింది నుంచి (2)
3. '... ఎక్కడే నవలామణి?' అని పాడుకున్నాడో సినీకవి (3)
5. హనుమాన్‌చాలీసా అనుగ్రహించిన రామభక్తుడీ కవి (5)
6. కాపలా.. తాయెత్తు (2)
7. లక్ష్మీ ముఖమనుకునేరు.. సంజాయిషీ కోరుతూ లేఖ, తెలుగు నోటీసు (3)
10. దానం చేసేవాడు (2)
11. మనజాతీయ జంతువు.. పవన్‌కల్యాణ్ సినిమా (2)
12. మొదట బంగారం, చివర వస్త్రం.. అర్థం వచ్చే పువ్వు గజిబిజి (5)
13. పూల పరిమళం (5)
14. రైలు సౌకర్యం లేక వీటి మీద ప్రయాణిద్దామంటే తలకిందులు (3)
15. 'గాథాసప్తశతి' కర్త (3)
16. పిల్లలను ఎక్కువగా ముద్దు చేయడం (3)
17. ఏడు రోజులు కలిస్తే (2)
19. పాండవుల్లో నాలుగోవాడే పాపం తడబడ్డాడు (4)
23. ఏనుగు (4)
26. విల్లు ఎక్కుపెడితే.. ఇది తప్పకూడదు గురూ! (2)
28. తిరగబడిన మన్మథుడి విల్లు (3)
29. ఆడవారు ముచ్చటగా అల్లుకునేవి (3)
31. వేసవి దెబ్బే కాదు, కమ్మని ఉపాహారం కూడా.. కింది నుంచి (2)
33. భర్త తల్లి.. కింద నుంచి (2)

**నిబంధనలు**

1. చతురంగాన్ని అదేపేజీలో పూర్తిచేసి పంపాలి. 2. తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. 3. గడువు తర్వాత అందిన పూరణలు పరిశీలింపబడవు. 4. ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతను ఎంపిక చేస్తాం. 5. ఒక్కొక్కరు ఎన్ని కూపన్‌లైనా పంపవచ్చు. 6. ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

చతురంగం పంపాల్సిన చిరునామా :

**చతురంగం** చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ -082

★ ఒకే కవరులో చతురంగం కూపన్లు ఎన్నయినా పంపవచ్చు ★ చతురంగం, చతురప్రవేశిక, క్యాప్షన్ మీదే, విపుల వినోదిని ఒకే కవరులో పంపినా పరిశీలిస్తాం

# చతురంగం - 9

రూ.150/- బహుమతి

**గడువు తేది : డిసెంబరు 19**

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | ■ | 4 | 5 | 6 | ■ | 7 | |
| 8 | | | డు | ■ | 9 | | | | ■ |
| | ■ | | ■ | 10 | | ■ | ■ | | ■ |
| ■ | 11 | ■ | 12 కాం | | | 13 | 14 | ■ | 15 |
| 16 | | 17 | | ■ | 18 | | | 19 | |
| | ■ | 20 | | | ■ | 21 స్తో | | | |
| 22 | 23 | ■ | | ■ | 24 | | ■ | | ■ |
| ■ | | ■ | 25 | 26 | ■ | 27 | 28 | డు | 29 |
| 30 | | 31 | ■ | 32 | 33 | ■ | | ■ | |
| ■ | 34 | | | ■ | 35 | | | | |

పంపినవారి పేరు: ----------------------------------------

వయసు (      ) చిరునామా : ----------------------------------

----------------------------------------------------------

---------------- పిన్ : ----------- ఫోన్ : ----------------

ఆధారాలు, నిబంధనలు 129 పేజీలో...

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, Plot No. 95 & 96, Gandhinagar, Quthubullapur Village & Mandal, R. R. District., Hyderabad-500 037. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore: 25583804. & www.eenadu.net.

# కాప్షన్ మీదే - 36



ఈనాడు కార్టూనిస్ట్, ప్రముఖ చిత్రకారుడు శ్రీధర్ వేసిన పై కార్టూన్‌కు నవ్వొచ్చే కాప్షన్ రాయండి. చక్కని బహుమతి అందుకోండి!
బాగున్న మరో నాలుగు ఎంపిక చేసి, పంపినవారి పేర్లను ప్రచురిస్తాం.

మీ కాప్షన్లు అందాల్సిన చివరి తేదీ ఈ నెల 19

చిరునామా: సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 082
e-mail : vipula.chatura@eenadu.net

ఉత్తమ వ్యాఖ్య :

**అంతరిక్షంలోకి రాకెట్ ప్రయోగం ఒక లాజిక్..**
**అది చంద్రుడిలోంచి దూసుకుపోవడం ఒక మేజిక్!**

– కూనపరెడ్డి సత్యనారాయణ,
ఆమందూరు, చిత్తూరు జిల్లా



## కాప్షన్ మీదే -35

బాగున్న మరికొన్ని కాప్షన్లు :

ఒక్క నిమిషం ఆపు గురూ!
ఇక్కడ స్థలాలు చౌకగా ఉన్నాయేమో చూసివస్తా!

- వెన్నా సాయి శ్రీరామ్, సికింద్రాబాద్

దూసుకుపోవటం అంటే ఇదేనా?

- ఎస్. పద్మావతి, విజయవాడ

ఆకాశాన్నంటిన
కూరగాయ ధరలకు పోటీగా
చంద్రమండలాన్ని దాటిన
టపాకాయ ధరలు

- మహబూబ్‌బాషా, ఆదోని

నీ తోక మండ! నా మీదకే వచ్చావే?

- ఎ. శ్రీచిన్మయి, బ్రాడీపేట, గుంటూరు

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. HD/965/2009-2011 RNI/32186/78

